# విషయసూచిక




# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౯ { ౧౯౫౩ – ఏప్రెల్ : : విజయ – చైత్రము } సంచిక ౧౦


## ప్రార్థన *

శ్లో. సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువమ్
విశ్వం నారాయణం దేవ మక్షరం పరమం పదమ్ ౧
విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణం హరిమ్
విశ్వమే వేదం పురుష స్తద్విశ్వ ముపజీవతి ౨
పతిం విశ్వస్యాత్మేశ్వరం శాశ్వతం శివ మచ్యుతమ్
నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్ ౩
నారాయణం పరంబ్రహ్మ తత్త్వం నారాయణః పరః
నారాయణ పరోజ్యోతి రాత్మా నారాయణః పరః ౪

—తైత్తిరీయ ఆరణ్యకము.

వెలకొలది (బహు) శిరములుగలవాడును, విశ్వదృష్టిగలవాడును, విశ్వము సమస్తమునకు ఆనందము నిచ్చువాడును, విశ్వవ్యాపకుడును మరణరహితుడును, పరమపదమును అగు శ్రీమన్నారాయణునకు (నమస్కరించుచున్నాను).

విశ్వవ్యాపకుడై, నిత్యుడై, విశ్వమున శ్రేష్ఠుడై మా లోటులను తొలగించగల శ్రీమన్నారాయణుని (ధ్యానించుచున్నాము.) ఈ బ్రహ్మాండమంతయు నతడే. అతడు విశ్వమంతట వ్యాపించియున్నాడు.

విశ్వేశ్వరుడు సమస్తజీవరాసులకు ప్రభువు, శాశ్వతుడు, ఆనందపూరితుడు, వినాశరహితుడు, అయిన నారాయణుని (ధ్యానించుచున్నాము.) అతడే మనము తెలిసికొనదగినవాడు. అన్నింటను వెలుగు ఆత్మస్వరూపుడు. అన్నిటికిని పరమావధి. శ్రీమన్నారాయణుడే పరబ్రహ్మము, పరతత్త్వము, పరమజ్యోతి, పరమాత్మ, శ్రేష్ఠుడు. ధ్యానించువాడును ధ్యానమును గూడ నతడే.

---

* ఇందు భగవానుని వ్యక్తావ్యక్తభావములు రెండును వర్ణింపబడి యున్నవి.

ఓం నమో భగవతే శ్రీ రామకృష్ణాయ!

# శ్రీ రామకృష్ణ వచనామృతము—'మ.'

## దక్షిణేశ్వరమున భక్తులతో శ్రీ రామకృష్ణ గురుదేవుడు

శనివారము,
22-12-1883.

అది సుమారు ఉదయము తొమ్మిదిగంటల వేళ. బలరామునితండ్రి వచ్చియుండెను. రాఖాలు, హరీష్, 'మ.' లాటు,—వీరెల్లరు కొన్నాళ్లనుండి యచటనే వసించుచుండిరి. శ్యామ పుష్కరిణినుండి దేవేంద్రఘోష్ గూడ వచ్చెను. వీరందరితో శ్రీరామకృష్ణగురుదేవుడు ఆగ్నేయపు వసారాయందు గూర్చొని యుండెను.

ఒక భక్తుడు : భక్తియెట్లు కలుగును?

శ్రీరామ : (బలరాముని తండ్రి మున్నగు భక్తులకు) 'ముందునకు బొమ్ము. ఏడు ప్రాకారముల తర్వాత మహారాజున్నాడు. అన్ని ప్రాకారములను దాటి లోనికి బోయిననే మహారాజు దర్శనము లభించును.

చాణకలో అన్నపూర్ణ దేవాలయ ప్రతిష్ఠాపన కాలమున ద్వారకాబాబుతో నేనిట్లు చెప్పితిని. గొప్ప కొలనులలో పెద్దపెద్ద చేపలు లోతు నీటియందుండును. మంచి యెఱగూర్చి గాలమువేసినచో దాని వాసనవలన పెద్దపెద్ద చేపలు లోపలినుండి పైకివచ్చి నీటిని కదలించును. ప్రేమభక్తియే ఎఱ.

భగవానుడు మానవలీల ననునయించును. శ్రీరాముడు, కృష్ణుడు, చైతన్యుడు—ఇట్టి మానవ రూపమున అవతరించును.

కేశవసేనున కిట్లు చెప్పితిని : మనుజులలో భగవంతు డెక్కువగా ప్రకాశించును. వర్షాకాలమునందు పొలములగట్లయందుగల బొరియలలో పీతలు, పురుగులు నివసించుచుండును. వానిని పట్టుకొనవలయునన్న బొరియలలో వెదకవలయును. భగవంతుని వెదకదలంచిన అవతారపురుషులయందే వెదకవలయును. ఈ ఎనిమిది జేనల మానవునియందు జగన్మాత ప్రకాశించుచున్నది. ఈ విషయము ఈ పాటయందును జూడవచ్చును : భావము

శ్యామామాత ఎంతటి విచిత్రమయిన యంత్రమును తయారుచేసినది? ఎనిమిది జేనల యంత్రమున ఎన్ని విధములగు నాటల జూపుచున్నది. తాను లోపల గూర్చొని యంత్రమును నడుపుచున్నది. యంత్రము తనంతటతానే నడచుచున్నట్లు భావించుచున్నది. తన్నెవరు నడపుచున్నదియు దానికి దెలియదు.

కాని భగవానుని దెలియగోరినచో—అవతార పురుషుల గుర్తింపవలయునన్నచో—ఎన్నియో సాధనలు గావలయును. కొలనిలో పెద్ద చేపయున్నది. దానిని పట్టుకొనదలంచినచో ఎఱవేయవలయును. పాలలోని వెన్న గావలయునన్న చిలుకవలయును. ఆవాలలోని నూనె కావలయునన్న వానిని గానుగాడింపవలయును. గోరంటాకు చేతులకు రక్తిమ కలిగించును. కాని దానినినూరి రాయవలయును.

భక్తుడు : (శ్రీరామకృష్ణునితో) సరే, భగవానుడు సాకారుడా, నిరాకారుడా ?

శ్రీరామ : ఆగుము, మొదట కలకత్తాకు వెళ్లిననేకదా ఎచ్చట మైదానమున్నదియు, ఎచ్చట 'బెంగాలుబ్యాంకు'న్నదియు ఎచ్చట 'ఏషియాటిక్‌సొసైటి' యున్నదియు తెలియుటకు ?

హొడదాలోని అగ్రహారమునకు వెళ్ల దలచినచో మొట్టమొదట హొడదాకు బోవలయును. నిరాకారసాధన ఏలచేయరాదు ? కాని అది యెంతయో కష్టము. కామకాంచనముల త్యాగమున్ననే కాని అది సిద్ధింపదు. బహిరంతరత్యాగములు రెండునుగావలయును. విషయబుద్ధి లేశమయినను నుండరాదు. సాకార సాధన సులభమే. కాని ఎంతో తేలిక కాదు.

నిరాకార సాధన జ్ఞానయోగసాధన. దానిని భక్తులయెడ ప్రశంసింపరాదు. ఎంతోకష్టపడగా కొంచెము భక్తిలభించినది. సమస్తమును స్వప్నతుల్యమని వారితో వచించినచో నికవారి భక్తికి హానికలుగును.

కబీరుదాసు నిరాకారవాది. శివుడు, కాళి, కృష్ణుడు—ఇట్టి వారిని నమ్మెడివాడుగాడు. కాళి అరటిపండ్లను అన్నమునుభుజించుననియు, కృష్ణుడు గోపికల కరతాళములతో కుప్పిగంతులు వేయుననియు జెప్పెడివాడు కబీరు. (అందరును నవ్విరి.)

నిరాకారసాధకుడు మొట్టమొదట దశభుజదేవిని దర్శించియుండవచ్చును. పిమ్మట చతుర్భుజమూర్తి, ఆపిమ్మట ద్విభుజ గోపాలమూర్తి చివరకు అఖండ జ్యోతిస్స్వరూపమును గాంచి దానియందు లీనము గావచ్చును.

దత్తాత్రేయుడు, జడభరతుడు, బ్రహ్మదర్శనమునుబొంది తిరిగి రాలేదని చెప్పబడియున్నది.

కొందఱి మతానుసారము శుకదేవుడు ఈ బ్రహ్మసాగరమున నొకబిందువే ఆస్వాదించెననియు, సముద్రపు కల్లోలమును మాత్రము గాంచి శ్రవణముచేసెను కాని సముద్రమున నిమగ్నుడు కాలేదనియు వచింతురు.

ఒక బ్రహ్మచారి కేదారనాథ క్షేత్రమును దాటిపోయినచో శరీరము నశించునని చెప్పెడివాడు. అట్లు బ్రహ్మజ్ఞాన లాభానంతరము శరీరముండదు. ఇరువదియొక్క దినములలో మరణము కలుగును.

ప్రహరీకి ఆవల పెద్ద మైదానము గలదు. నలుగురు స్నేహితులు ప్రహరీ కావల నేమియున్నదోయని చూడ ప్రయత్నించిరి. ఒక్కొక్కడు ఈ ప్రహరిపై కెక్కెడివాడు. ఆవల బయలును (మైదానము) జూచి ఆహాయని నవ్వుచు ఆవైపునకే ఉరికెడివాడు. ఇట్లు ముగ్గురు ఎట్టి కబురును గొనిరాలేదు. ఒకడే తీసికొనివచ్చెను. బ్రహ్మజ్ఞాన లాభానంతరము జగద్ధితార్థము అతని శరీరము అవతారపురుషులకువలె నిలిచియుండెను.

హిమవంతుని గృహమున పార్వతి జనించెను. అతనికి ఆమె యెన్నియోరూపముల జూప నారంభించెను. అపుడతడు 'అమ్మా ! యెన్నియోరకములగు నీరూపముల జూచితిని. కాని నీకు బ్రహ్మస్వరూప మొకటి కలదు. దానిని నాకు జూపుము.' 'తండ్రీ ! నీకు బ్రహ్మజ్ఞానము వలయునేని నీ వీ సంసారమును వదలి సాధుసంగమము నొనరింపుము' అని పార్వతి బదులు చెప్పెను.

హిమవంతుడు ఆ పలుకులు వినక పట్టుపట్టగా పార్వతి అతని కొకపరి బ్రహ్మస్వరూప

మును జూపెను. ఆ రూపమును జూడగనే హిమవంతుడు మూర్ఛితుడయ్యెను.

ఇంతవఱకు నేను జెప్పినది సమస్తమును, తత్త్వవిచార విషయము. 'బ్రహ్మసత్యం జగన్మిథ్య' ఇదియే తత్త్వవిచారము. సర్వమును స్వప్నతుల్యము. ఈ మార్గమెంతయో కఠినమైనది. ఈ మార్గమున భగవల్లీల సమస్తమును స్వప్నప్రాయమగు మిథ్యయగును. ఇక 'నేను' అనునదియును నుండదు. భగవదవతారమునుగూడ ఈ మార్గమున లక్షింపరు. ఇది మిక్కిలి కఠినమార్గము. ఇట్టి తాత్త్విక విచారమును భక్తు లెక్కుడుగా వినరాదు.

కావుననే భగవానుడు జగమున నవతరించి భక్త్యుపదేశము నొసగును— శరణాగతుడవు గమ్మని బోధించును. భక్తివలన ఆయనకృప చేత సమస్తమును భక్తుడు పడయును— అనగా జ్ఞానము, విజ్ఞానము అను రెంటిని బడయును.

భగవానుడు లీలలొనర్చుచున్నాడు. ఆయన భక్తులకధీనుడు. శ్యామాదేవి జగన్మాత; భక్తిసూత్రమున భక్తునితో బంధింపబడి యున్నది.

ఒక్కొక్కపుడు భగవానుడు అయస్కాంతముగ మారును. భక్తుడు సూదియగును. మఱి యొకప్పుడు భక్తుడయస్కాంతమగును; భగవానుడు సూదియగును. భక్తుడు భగవానుని దనయొద్దకు ఆకర్షించును. భగవానుడు భక్తవత్సలుడు. భక్తుల యధీనముననుండును.

ఒకక్రమతానుసారిణి యశోదాది గోపికలు పూర్వజన్మమున నిరాకారవాదులై యుండిరి. వారికి అందు తృప్తికలిగినది కాదు. కావుననే బృందావనలీలలయందు శ్రీకృష్ణునితో ఆనందముననుండిరి. ఒకనాడు శ్రీకృష్ణుడు గోకులమున గోపులజూచి 'మీరు నాతో రండు. మీకు నిత్యధామమును జూపెదను. రండు, యమునలో స్నానము చేయుదము,' అని పలికెను. అందరును ఆయనతోకలిసి స్నానముచేసిరి. యమునలో మునిగి లేచునప్పటికి వారందఱకును గోలోకదర్శనము, అటుపిమ్మట అఖండజ్యోతిర్దర్శనముకలిగినది. యశోద యిట్లు పలుకనారంభించెను: 'ఓరీ కృష్ణా! ఇవన్నియు నే జూడవలయు నవసరములేదు. నీ మానుషరూపమునే చూడగోరెదను. నిన్ను నాయొడిలో గూర్చుండబెట్టుకొని అన్నము తినిపింతును.'

అవతారములందు భగవాను డెక్కువగా ప్రకాశించును. అవతారము మానుషశరీరముననుండగనే పూజార్చనాదులు సలుపవలయును. 'తెల్లవారిన అతడు తన రహస్యాగారమున దాగుకొనును.' అవతారము నెల్లరును గుర్తింపజాలరు. దేహము ధరించినంతట మనవలె రోగము, శోకము, క్షుధ, తృష్ణ— ఇవన్నియు ఆయనకునుగలుగును. శ్రీరాముడు సీతకొఱకు శోకముతో నేడ్వనారంభించెను.

'పంచభూతముల వలలోబడి బ్రహ్మము ఏడ్వనారంభించెను. పురాణములో హిరణ్యాక్షవధానంతరము వరాహమూర్తి తనపిల్లల పొత్తున హాయిగానుండి వానికి పాలిచ్చుచుండెనట. తన వైకుంఠముమాటగూడ మఱచిపోయెను. అంతట శివుడు తన త్రిశూలముతో ఆ శరీరమును ధ్వంసముచేయగా నవ్వుతో తన స్వపురమగు వైకుంఠమును జేరెను.

సాయంకాలమయినది. అపుడు భవనాథుడు వచ్చెను. శ్రీగురుదేవుని గదియందు రాఖాలు, 'మ.' హరీషుడు మున్నగువారు గూర్చొని యుండిరి.

శ్రీరామ : (భవనాథునితో) అవతారము మీద ప్రేమజనించిన జాలు. ఆహా! గోపికలకు శ్రీకృష్ణుడన్న నెంత ప్రేమ! అని పలుకుచు గోపీభావముతో పాటలుపాడ నారంభించెను. 'ఓ శ్యామా! నీవు మా ప్రాణాత్ప్రాణమవు......' మఱియొక పాట 'సఖీ ఇంటికి పోనేపోను......'

ఆ దినము నేను ఇంటిగుమ్మమునొద్ద నిలిచి యుండగ నీవు వనమునకు బోవునపుడు...'

రాసక్రీడయందు శ్రీ కృష్ణు డంతర్ధానము కాగా గోపికలు ఒక్కొక్కరును ఒక్కమాటుగా ఉన్మత్తలైరి; చెట్టునుజూచి 'నీవా, తపస్వివి! శ్రీ కృష్ణుని నీవు తప్పక చూచి యుందువు, లేనిచో నిట్టి నిశ్చల సమాధిస్థితి నీకెట్లు కలిగినది?' యనిరి. కొందఱు పచ్చికబయలునుజూచి 'ఓ పృథివీ, నీవు తప్పక శ్రీ కృష్ణుని దర్శనమును బడసితివి. లేనిచో నీ కిట్టి రోమాంచనమేల కలుగును? నిజముగా నీకు ఆ మహనీయుని స్పర్శా సుఖము లభించినది.' మాధవీ లతనుజూచి, 'ఓ మాధవీ, మా మాధవుని మాకిమ్ము'. అని పలికిరి.

గోపికలకు ప్రేమోన్మాదము కలిగినది. అక్రూరుడు వ్రజపురమునకు వచ్చినపుడు శ్రీ కృష్ణ బలరాములు మథురకు బోవుటకై రథము నెక్కిరి. అపుడు గోపికలు రథచక్రముల బట్టికొని 'మేము పోనీయము' అని పలికిరి. ఈ మాటలు పలుకుచు శ్రీరామకృష్ణగురుదేవుడు ఒకపాట బాడ నారంభించెను : పాటభావము :

రథచక్రమును బట్టుకొనవలదు. రథము చక్రమువలన నడుచుచున్నదా ? ఏచక్రముల చక్రి హరియో ఆయన చక్రమువలననే ప్రపంచమంతయు నడుచుచున్నది.

శ్రీ రామకృష్ణ గురుదేవుడు ఈ పాట బాడుచు నిట్లు చెప్ప నారంభించెను : రథము చక్రమువలన నడచునా? 'ఏచక్రమువలన బ్రహ్మాండము బ్రహ్మాండముగ తిరుగునో' 'రథియాజ్ఞ మేరకు సారథి నడుపును.'—ఈ పలుకులన్నియు గూడ నాకు మర్మస్పర్శను గలిగించుచున్నవి.

# ఆత్మనిరూపణము

ప్రవక్త :
శ్రీ వివేకానందస్వామి

అనువాదకులు :
శ్రీ చుక్క కృష్ణమూర్తి

శా॥ కాలవ్యాళము దండతాడనఫణా ॥ క్రాంతిన్ విడంబించు; నా
భీలజ్వాల రగిల్చినంతనె కడున్ ॥ వెల్గొందు హేతిచ్ఛటల్,
కోలందూలిన సింహగర్జనమునన్ ॥ ఘూర్ణిల్లు ఘోరాటవుల్,
గాలిన్ వ్రీలుచు నీలమేఘము తటి ॥ త్కాంతిన్ జలంబిచ్చు, నా
లీలన్ జ్ఞానులు సర్వశక్తులను గ్రాకలింతు ర్మనోఘర్షణన్. 1

ఉ॥ రాగము శూన్యమైన, ననుర ॥ రాగము మిత్రులపట్ల దప్పినన్,
యోగము దుష్టమైన, నభి ॥ యోగము లింటను పాతుకుండినన్,
వేగమదృష్టితగ్గినను, ॥ విశ్వము నిన్ను పరిత్యజించినన్,
వీగకు భవ్యమార్గమును, ॥ పెన్వోతజిక్కిన, గుండె ప్రుక్కినన్. 2

గీ॥ ప్రకృతి నిన్నెంతయేనియు * బాడుసేయ, భీకరాకృతి ధరియించి * భీతిగొలుప
నెంచుగాక, భయంపడి * యెద వదేమొ? నీవు దైవాంశమవుసుమా * నిక్కువముగ,
నెడమ కుడివైపులకునేగ * కెద్దియనక, తరలిపొమ్మిక నిర్ణీత * తలమునకును! 3

ఉ॥ మానిసిగాను, నే దుదిన * మర్త్యుడగాను, అనాగరుండ నున్
గాను, అశాశ్వతంబయిన * కాయముగాను, మరిన్ మనంబునున్
గాను, మహీస్థలిన్ బురుష * కామినులందున నేమిగాను, నన్
బూని నుతింపలేక తొలి * పొత్తములన్నియు నిల్చె మూగలై,
యేన యతండు, దాపనిక * నేల, అఘంబులు దాకునే ననున్? 4

గీ॥ శశికి, నినునకు, నక్షత్ర * సమితికెల్ల, కాలమునకును, ధాత్రికి * గ్రహములకును,
నగ్రజుండనై జనియించి * యాదినుండి, యుందు, నుండితి, నున్నాడ, * నుజ్జ్వలగతి. 5

గీ॥ సుందరంబగు భూమియు, * సుప్రకాశ, వంతుడైనట్టి చంద్రుడు, * ప్రజ్జ్వలుండు
నైన సూర్యుడు, తళతళ * లాడు మిన్ను, నెగడు, లోబడి కారణ * నియమములకు.
నవియు బందాలలోబుట్టి * యుండె గిట్టు. 6

గీ॥ స్వప్నమయమగు వలబన్ని * వాని నెల్ల, బూని పట్టుచునున్నది * మానసంబు,
భావపుం జేక పడుగుల * పన్నికలను, గలుగుచున్నవి మంచి చెడ్డలును, ధరయు,
స్వర్గ నరకములును, నెల్ల * సమయములను. 7

గీ॥ కాలమును, దేశ ఫలితముల్, * గారణమును, బయలిపెంకని తెలియుము, * భావములకు,
నెల్ల యింద్రియసమితి కతీతుడనయి, జనెద, బ్రహ్మాండమునకెల్ల * సాక్షినగుచు. 8

గీ॥ రెండుగావివి, వానికి * మెండుగావు, అన్నియును నేక, మదియు నాకయంద యుండు
కారణంబున, ప్రేమింప * గలనుగాని, నన్ను నేనేవగింతునే * యెన్నడేని,
భయపడగనైన నేర్తునే, * భ్రమసిపోయి. 9

గీ॥ స్వప్నములనుండి మేల్కొమ్ము * సకలమైన, బంధములనుండి స్వేచ్ఛను * బడయు మింక,
నీ విచిత్రమ్మునకు భీతి * బో విడువుము, నన్ను నానీడ బెదరింప * దెన్నటికిని,
నేను తానని తెలియుము * నిశ్చయముగ! 10



# శ్రీ వివేకానంద సంభాషణలు

అనువాదకుడు : శ్రీ పిన్నింటి సుబ్బారావు

[జాతి, గుణముల ననుసరించి చాతుర్వర్ణ్య విభాగము—పాశ్చాత్యుల యందలి బ్రహ్మ, క్షత్రియులు—కులగురువు పద్ధతి]

స్వామిజి, కలకత్తాయం దున్న స్వర్గీయ బలరాంబోసుగారి గృహమందుండగా, నేనొక సారి శ్రీవారిని దర్శించుటకై వెళ్లితిని. జపాను దేశమునుగూర్చియు, అమెరికా ఖండమును గూర్చియు, దీర్ఘసంభాషణానంతరము, నేను, స్వామిజీ! "తమకు పాశ్చాత్యులం దెందఱు శిష్యులు గలర"ని ప్రశ్నించితిని.

స్వామిజి:—అనేకులు.

ప్రశ్న:—రెండు వేలా? మూడు వేలా?

స్వామిజి:—అంతకంటె నెక్కువగాకూడ ఉండ వచ్చు.

ప్రశ్న:—తమరు వారికందరికిని మంత్రోప దేశమును చేసితిరా?

స్వామిజి:—అవును.

ప్రశ్న:—ఓంకారమును జపించుటకు వారికి తమరు అనుమతినిచ్చితిరా?

స్వామిజి:—అవును.

ప్రశ్న:—మహారాజ్! ఏ విధముగా నిచ్చితిరి? బ్రాహ్మణులు తప్ప, శూద్రులు ప్రణవో చ్చారణ చేయగూడదని శాస్త్రములు చెప్పుచున్నవే. పైగా పాశ్చాత్యులు మ్లేచ్ఛులే. శూద్రులైనను గారు.

స్వామిజి:—నే నుపదేశించినవారలు బ్రాహ్మణులుగారని నీవెట్లు చెప్పగలవు?

నేను:—యవనులు, మ్లేచ్ఛులుగల దేశము లందు, తమకు బ్రాహ్మణులెట్లు లభ్యమైరి?

స్వామిజి:—నా శిష్యులందరును బ్రాహ్మణులే! బ్రాహ్మణులు తప్ప నింకొకరు ప్రణవో చ్చారణ చేయరాదను సత్యమును నేను శిరసా వహింతును. బ్రాహ్మణపుత్రుడు, బ్రాహ్మణు డగుట కవకాశము లున్నను ఆతడు బ్రాహ్మణుడే యని నిర్ణయింప రాదు. బాగ్ బజారునందు నివసించుచున్న అఘోరచక్రవర్తి మేనల్లుడు వీధులను తుడుచు పాకీవాండ్రవృత్తి నవలంబించి యా కులమందు గలియలేదా? ఆతడు బ్రాహ్మణకుమారుడు గాడా?

బ్రాహ్మణ కులము, బ్రాహ్మణ ధర్మములు రెండును వేరు. హిందూదేశములో జాతిమాత్ర ముననే యొకనిని బ్రాహ్మణునిగను, పాశ్చాత్యులలో గుణముచేతనే యొకనిని బ్రాహ్మణునిగను పరిగణింతురు. సత్త్వ, రజ, స్తమో గుణములని త్రిగుణము లెట్లున్నవో, యా రీతిగా, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణములను దెలియుటకుగూడ గుణములు

గలవు. భారతదేశములో బ్రాహ్మణ, క్షత్రియ గుణములు నశించిపోవుచున్నవి. పాశ్చాత్యులు ఇదివఱకే క్షత్రియులై నేడు వారిలో చాల మంది బ్రాహ్మణులై వెలయుచుండిరి.

ప్రశ్న:—అయితే, తమరు ఎవరు సత్త్వగుణ ప్రధానులో వారలను బ్రాహ్మణులని పరిగణింతురన్నమాట.

స్వామిజి:—ఆలాగుననే, ప్రతి మానవునియందును, త్రిగుణములలో నేదియో యొక గుణము, స్వల్పముగనో, హెచ్చుగనో యుండుచుండును. అందుచే నాలుగు వర్ణములను దెలియచేయు గుణములు ప్రతివానియందును స్వతసిద్ధమైయుండును. కాని యప్పుడప్పుడు నొక్కొక్కనియం దొక్కొక్కటి గాని, రెండు గాని గుణములు హెచ్చుగానుండి యవి ప్రస్ఫుట మగుచుండును. వివిధవృత్తులను జేయుచున్న యొక మానవుని పరిశీలింపుము. జీతమునకై యొకనియొద్ద నౌకరీ చేయుచున్నంతకాలము శూద్రధర్మమునందును, స్వంతవ్యాపారమును జేయుచున్న వైశ్యవృత్తియందును, అధర్మమును నాశనముచేసి ధర్మమును స్థాపించుటకై కృషియొనర్చిన క్షత్రియ ధర్మమునందును, భగవంతుని ధ్యానించుటయందు గాని, యాతని సంబంధములగు విషయములను సంభాషించుటయందు గాని కాలమును వినియోగించుచున్న బ్రాహ్మణ ధర్మమునందును నున్నవాఁడని చెప్పవలయును. ఒక కులమునుండి మఱియొక కులమునకు మారుట సహజవిషయము. అట్లు గానిచో వశిష్ఠుడు బ్రాహ్మణుఁడుగను, పరశురాముడు క్షత్రియుఁడుగను ఎట్లైరి?

ప్రశ్న:—తమరు చెప్పినది యథార్థము. కాని మన పండితులు, కులగురువులు, ఈ విషయము మనకు ఎందుకు దెల్పరు?

స్వామిజి:—మన దేశమందలి గొప్ప దౌర్భాగ్యములలో నిదియొకటి. ఈ విషయము నింతటితో నాపుదము.

ఇచ్చట స్వామిజి పాశ్చాత్యుల అనుష్ఠాన రూపముగా విషయమును గ్రహించు స్వభావమును మిక్కిలి కొనియాడి, మతవిషయములందుగూడ వారి యనుష్ఠానాభిలాషనుగూర్చి యుపన్యసించిరి.

నేను:—నిజము, మహారాజ్! మత సంబంధములగు సాధనలను చేయుచున్నప్పుడు వారి యొక్క ఆధ్యాత్మిక, మానసికశక్తు లతి శీఘ్రముగా వికాసము చెందుచున్నవని విని యుంటిని. శ్రీ శారదానందస్వామివారు ఒక పాశ్చాత్యశిష్యుడు తానుపదేశించిన సాధనలను నాలుగుమాసము లభ్యసించి నంతనే తనయం దెట్టి యాధ్యాత్మికశక్తు లుద్భవించినవో తనకువ్రాసిన లేఖను నాకు జూపిరి.

స్వామిజి:—ఇప్పు డర్థమైనదా! పాశ్చాత్యులందు బ్రాహ్మణులు గలరో లేరోయని! మన దేశమునందును బ్రాహ్మణులు గలరు. కాని వారు మనలను బాధించి మన దేశమును నాశనముచేయుచు, వారుగూడ క్రమక్రమముగా నాశనమగుచున్నారు. గురువు శిష్యునకొక మంత్ర ముపదేశించును. కాని యిది యొకవిధమగు వ్యాపారమైనది. ఈ రోజులలో గురుశిష్య సంబంధ మెంతఆశ్చర్యకరముగా నున్నది! గురువు తిండి లేక మాడిపోవుచున్నచో, ఆతనిభార్య, యా

తనితో, "ఎందుకీ చదరంగపుటాటలు. ఒక సారి శిష్యులయొద్దకు సంచారమునకై వెళ్లి వమ్ములను నాకలిమరణములనుండి రక్షింప గూడదా" యని సంబోధించును. అంతట ఈ కులగురువు "సరే బాగున్నది. రేపు నాకీ విషయము జ్ఞాపకముచేయుము. ఈ మధ్య నా శిష్యులలో నొకనికి గొప్ప యదృష్టము పట్టినదని వినియుంటిని. వానిని చూచి చాలాకాలమైనదిగూడను" అని నుడువును. మన దేశములో కులగురువు పద్ధతి యీ విధముగానున్నది. పాశ్చాత్య దేశములలో కులగురువులవలన నింతటి బాధలులేవు. అచ్చటి స్థితి మనకంటె బాగున్నది.



# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిశరణమ్

బేలూరు మఠము,
17-4-'17.

ప్రియ దే...

నీవు వ్రాసిన యుత్తరముజూచి సంతసించితిని. "ఈశ్వరః సర్వభూతానాం..." (గీ. 18-31) ఈ ఈశ్వరవాక్యమే భగవానుడే మనలను నడుపుచున్నాడని మనకు తెలియజేయు చున్నది. మఱియు, 'మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః' (గీ: 4-11) ఈ వచనమునుగూడ మనము పరమాత్మునే యనుసరించుచున్నట్లు ప్రమాణము చేయుచున్నది. ఇక మనము ఆయన ఆజ్ఞ—'తమేవశరణం గచ్ఛ సర్వభావేన' (గీ. 18-62)-ను పరిపాలించుటయే మన కర్తవ్యము. నీవును దానినే వ్రాయుచున్నావు — "ఆయన తలంపుగాక మరి యే యితర చింతలను మనస్సు నంటనీయక చూచుకొనుటయే కర్తవ్యము. ఇక ఈ కలత ఏల? నీ చింతాప్రవాహమును జదివి సంతసించితిని. సద్విషయములనే ఆలోచించు చున్నావు. ఇట్లు భగవదభిముఖముగ ముందంజవేయుము. ఆయన కృపాకటాక్షము నపేక్షించియుండుము. కొంతకాలమునకు ఆయన కృపావారి నీపై వర్షించును. నీ జీవితము ధన్యమగును. ఇపుడును నీ జన్మ ధన్యమయినదియే. భగవద్ధ్యానము చేయగలుగు చున్నావు. అంతకంటె నితరమేమి కావలయును! నీ కుశలమునకై ప్రార్థించుచున్నా డను.

ఇట్లు,
ప్రేమపూర్వకాశీర్వచనములతో,
శ్రీ తురీయానంద



శ్రీ హరిశరణమ్

బేలూరు మఠము,
11-5-'17

ప్రియ దే...

నీవు 6-వ తేదీన వ్రాసిన యుత్తరమును జూచి యెంతయు సంతసించుచున్నాను. నీకు నానాటికి భగవద్భక్తి అభివృద్ధియగుచున్నదని చక్కగా దెలియవచ్చుచున్నది. ఇందువలన భగవత్కటాక్షము నీయందున్నదనియే విశదమగుచున్నది. ప్రభువు నీకు, శ్రద్ధాభక్తులను హృదయ బలమును ప్రసాదించుగాక! నీవు క్రమముగా ఆయన కభిముఖముగా నడచుచు సమస్త తుచ్ఛ వాసనల బంధమునుండి విడివడి ఆయనకే నీ మనఃప్రాణముల నర్పింపుము. ఇదియే మన జన్మసారాంశమని గ్రహించి సదా ఆయననే ఏకాంతభక్తితో ఆశ్రయింపుము. అటు చేసినచో సమస్త కష్టములు తీరును. ఎల్లవాంఛలును సమకూరి పరమ శ్రేయస్సును బడయుదువు. తూర్పున కెంత దగ్గరగా బోవుదుమో పశ్చిమమున కంత దూరస్థులమగుదుముగదా? అట్లే మన మెంతగా భగవదభిముఖులమగుదుమో అంతగా సాంసారిక చింతలకు దూరస్థులమగుదుము. ఇక సంసారబంధ విముక్తికై యెంతయో ప్రయత్నమవసరములేక యుండును. ఎంతో కాలము నిరంతరముగ భగవద్భావమును శ్రద్ధా భక్తులతో హృదయమున బోషింపవలయును. అపుడే అది స్థాయినందును. ఎల్లప్పుడును ప్రార్థనాశీలుడవై యుండుట యెంతయు ఆవశ్యకము. అట్టి స్థితియందు మన అంతరంగమును ఆయనకు విన్నవించుకొన్నచో ఆయన వినును. నీ ప్రార్థన వైఖరినిజూచి యెంతయు నానందించుచున్నాను. నీవు ఆయనవలన ప్రేమను భక్తిని ప్రార్థింపవలయును. ఇవి యెంతయు దుర్లభములగు వస్తువులు. ఇవి లభించినచో ఇక నే లోపము నుండబోదు. అపుడు మన హృదయములు మధుమయములై సమస్త స్థితులయందును పూర్ణశాంతిని అనుభవింపగలము. ఆయన ద్వారముకడ 'బడియుండుటయే మన కర్తవ్యము. అట్లు పడియున్నచో సమస్తమును తమకు దామె చక్కబడును. భగవానుడే సమస్తమును సవరించును—చక్కబెట్టును.

శరీరమిట్లే యుండదు. ఒకపుడు చక్కగను మరియొకపుడు పీడితముగను నుండును. ఎట్లయినను మొత్తముమీద నాశమువైపునకే పోవుచుండును. ఇది చిరస్థాయి కాదు గదా! ఒకనాడు కాకపోయినను మఱియొకనాడు పోవలసినదియే. ఇక దీనినిగూర్చి నేను చెప్పవలయునదేమి కలదు? భగవంతుని పాదపద్మములయందు మనస్సు నిలుపగలిగినచో శరీరధారణ సార్థకమయినట్లే.

భగవత్పాదారవిందములందు నీ మనస్సును లగ్నముగావించి నిశ్చింతతో మెలగుము. ఏలయన, ఇంతకుమించిన ఉత్కృష్టకార్యము వేఱొకటి లేదు.

ఇట్లు,
శుభాకాంక్షలతో,
శ్రీ తురీయానంద

# “మోహముద్గరము”

కర్త:
శ్రీ శంకరభగవత్పాదులు

అనువాదకులు:
శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

1. మూఢజహీహి ధనాగమ తృష్ణాం, కురుతనుబుద్ధిమనసి సువితృష్ణాం।
యల్లభసే నిజకర్మోపాత్తం, విత్తంతేన వినోదయ చిత్తం॥

తా॥ హే మూఢా! ధనమునెడల కాంక్షను వీడుము; అల్పమతీ! మనసును వైరాగ్యముచే నింపుము. నీ కర్మలమున చేకూరు ధనముతో సంతోషింపుము.

2. కాతవకాంతా, కస్తేపుత్రః, సంసారో హయతీవ విచిత్రః।
కస్యత్వం వా కుత ఆయాతః, తత్త్వంచింతయ తదిదంభ్రాతాః॥

తా॥ నీ భార్య ఎవరు? నీ పుత్రు లెవరు? ఈ మాయసంసారము మిగుల చిత్రమైనది. ఎందుండి వచ్చితివో వెవ్వరివాడవో సోదరా! యోచింపుము.

3. నళినీదళగత జలమతితరళం, తద్వజ్జీవన మతిశయచపలం।
విద్ధివ్యాధివ్యాలగ్రస్తం, లోకం శోకహతంచ సమస్తం॥

తా॥ తామరాకులోని నీటిబొట్టు ఎట్లు చంచలమైనదో జీవనముకూడ నట్లే చంచలమైనది. వ్యాధి విషధరము టగఱచుటచే ప్రపంచమంతయు శోకహతమై యున్నది.

4. అంగం గలితం పలితం ముండం, దంతవిహీనం జాతం తుండం।
కరధృత కంపిత శోభితదండం, తదపినముంచ త్యాశాభాండం॥

తా॥ తల నరిసినది. శరీరము శిథిలమైనది. నోట పండ్లూడినవి. చూచుటకు ముఖ మసహ్యముగ నున్నది. చేత ఱ్ఱపుచ్చుకొని మనుజుడు వడకుచు నడచుచుండెను. అయినను అతడు తన యాశను విడువజాలక పోవుచుండెను.

5. దినయామిన్యౌ సాయంప్రాతాః, శిశిరవసంతౌ పునరాయాతం।
కాలః క్రీడతి గచ్ఛత్యాయు, స్తదపి న ముంచత్యాశావాయుః॥

తా॥ పగళ్లును, రాత్రులును, సాయంకాలములును, ఉదయములును శిశిరమును వసంతమును,కడచివచ్చుచున్నవి. ల మిట్లే యాటలాడుచుండును. ఆయువు క్షీణించుచుండును. అయినను మానవుడు ఆశావాయువును త్యజింప న్నాడు.

6. యావజ్జననం తావన్మరణం, తావజ్జననీ జఠరేశయనం।
ఇతి సంసారే స్ఫుటతరదోషః, కథమిహమానవ తవసంతోషః॥

తా॥ జన్మలున్నంతకాలము మరణములుండును. జననీజఠరమున మరల పరుండవలసివచ్చును. ఈ సంసారము దుఃఖమునకు ఇల్లు. కావున ఓ మానవుడా! ఏల సంతోషపడెదవు?

7. సురవరమందిర తరుతలవాసః, శయ్యాభూతల మజినం వాసః।
సర్వపరిగ్రహ భోగత్యాగః, కస్య సుఖం నకరోతి విరాగః॥

తా॥ దేవమందిర తరుతలవాసములు, భూతలశయనము, మృగచర్మవసనము, సముదయ పరిజన పరిహారము, భోగత్యాగము, ఇట్టి విరాగమున సుఖమెవరికుండదు ?

8. అష్టకులాచల సప్తసముద్రాః, బ్రహ్మాపురందర దినకరరుద్రాః।
నత్వం నాహం నాయంలోకః, స్తదపి కిమర్థం క్రియతే శోకః॥

తా॥ కులపర్వతము లెనిమిది, సముద్రము లేడు, బ్రహ్మ పురందరుడు రుద్రుడు సూర్యుడు నీవు నేను ఈ విశ్వమంతయు స్వప్నము. అయినను నీవు శోకమందేల మగ్నుడవగుదువు?

9. బాలస్తావత్ క్రీడాసక్తః, తరుణస్తావత్ తరుణీరక్తః।
వృద్ధస్తావత్ చింతామగ్నః, పరమే బ్రహ్మణి కోఽపినలగ్నః॥

తా॥ బాలుడై యున్నంతకాలము మనుజుడు ఆటలం దాసక్తి చెందియుండును. యౌవనమున తరుణియెడల ననురక్తుడై యుండును. వార్ధక్యమున చింతానిమగ్నుడై యుండును. యింక పరబ్రహ్మమందు మగ్నుడైయుండు టెపుడు ?

10. యావద్విత్తోపార్జనశక్తి, స్తావన్నిజపరివారో రక్తః।
తదనుచ జరయా జర్జరదేహే, వార్తాంకోఽపి నపృచ్ఛతిగేహే॥

తా॥ మానవుడు ధనమును సంపాదించునంతకాలము సేవకులు వశవర్తులై యుందురు. ముసలితనమున శరీరము జీర్ణింపగనే యింటియం దాతని నెవ్వరు పిలువనైన పిలువరు.

11. అర్థమనర్థం భావయనిత్యం, నాస్తితతః సుఖలేశః సత్యం।
పుత్రాదపి ధన భాజాం భీతిః, సర్వత్రైషా విహితారీతిః॥

తా॥ "అర్థమనర్థం" అను భావమున్నంతకాలము లేశమాత్రము దుఃఖముండదు. ఇది నిక్కము. ధనమునం దించుకంతయు సుఖములేదు. ధనము నెడ మక్కువగలవానికి కొడుకువలనగూడ భీతికలుగుచుండును. అన్ని యెడల నీ రీతి విహితమై యున్నది.

12. మాకురు ధనజనయౌవనగర్వం, హరతినిమేషాత్ కాలః సర్వం।
మాయామయమిద మఖిలం హిత్వా, బ్రహ్మపదం ప్రవిశాశు విదిత్వా॥

తా॥ ధన జన యౌవనముల యహంకారమును త్యజింపుము. నిమేషకాలములో నంతయు నశించిపోవును. మాయామయమైన ఈ సంసారమును పరిత్యజించి బ్రహ్మపదమున నాశ్రయము గొనుము.

13. శత్రౌమిత్రే పుత్రేబన్ధౌ, మాకురుయత్నం సమరే సంధ్యౌ।
భవ సమచిత్తః సర్వత్రత్వం, వాంఛాస్య చిరాద్యది విష్ణుత్వం॥

తా॥ శత్రువులనియు మిత్రులనియు పుత్రులనియు బంధువులనియు సంధియనియు యుద్ధమనియు యోజింపకుము. విష్ణుపదముల చేర వాంఛింతువేని నిరంతరము సర్వభూతములయెడ సమభావముగలిగి ప్రవర్తింపుము.

14. త్వయిమయిచాన్యత్రైకోవిష్ణుః, వ్యర్థంకుప్యసి మయ్యసహిష్ణుః।
సర్వం పశ్యాత్మాన్యాత్మానం, సర్వత్రోత్సృజభేదజ్ఞానః॥

తా॥ నీయందును నాయందును సర్వప్రాణులందును నొక్కే శ్రీహరి యున్నాడు. ధైర్యసాహసములను వీడి వృథా యేల కోపగింతువు? నీ యాత్మయం దనవరతము నన్యాత్మలను విలోకింపుము. ప్రాణులయెడ భేదభావము పరిత్యజింపుము.

15. కామం క్రోధం లోభం మోహం, త్యక్త్వాత్మానం పశ్యహికోఽహం!
ఆత్మజ్ఞానవిహీనామూఢాః, స్తే పచ్యంతే నరకనిగూఢాః॥

తా॥ కామ క్రోధ లోభ మోహములను పరిత్యజింపుము. 'నే నెవడను' అని యొకమారు ప్రశ్నింపుము. ఆత్మజ్ఞానవిహీనులైన మూఢజనులు దుస్తరనరకమున మునుంగుదురు.

16. తత్త్వంచింతయ సతతంచిత్తే, హరిహరచింతాం నశ్వరచిత్తే।
క్షణమిహ సజ్జనసంగతిరేకా, భవతి భవార్ణవ తరణే నౌకా॥

తా॥ పరమాత్మ తత్త్వమును సదా చింతనమొనరింపుము. అనిత్యమైన ధనమునెడగల చింతను వీడుము. సజ్జన సాంగత్యము చేయుము. క్షణకాలపు సజ్జన సాంగత్యము భవసాగరము తరించు నోడ యగును.

17. షోడశపజ్ఝటికాభిరశేషః; శిష్యాణాంకథితోహ్యుపదేశః।
యేషాంనైషకరోతి వివేకం, తేషాం కః కురుతామతిరేకం॥

తా॥ పదునాఱు శ్లోకములందు శిష్యు లుపదేశమందిరి ఈ యుపదేశముల మూలమునైనను నెవరికిని వివేకము కలుగనిచో ఎవరుగాని వారికేమియు బోధింపజాలరు.

సంపూర్ణం.
ఓం తత్ సత్.



# కర్మసిద్ధాంతము

ప్రతివాదిభయంకర వేంకటాచార్యులు

మన హిందూమతస్థులకు కర్మసిద్ధాంతము ప్రధానమైనది. కర్మ అనగా మనము చేయు పని. అది మూడు విధములు. 1 మానసికము, 2 వాచికము, 3 కాయికము. మానసికము మనస్సుతో చేయు పని. అనగా ఆలోచించుట. వాచికము వాక్కుతో చేయుపని అనగా మాట్లాడుట. కాయికము శరీరముతో చేయు పని. ఆలోచనలు రెండు విధములు. మంచి ఆలోచనలు, చెడ్డ ఆలోచనలు. ఒకరికి ధర్మముచేయవలయునని తలచుట మంచి ఆలోచన. అన్యాయముచేయవలయునని తలచుట చెడ్డ ఆలోచన. మాటలు రెండు విధములు. మంచి మాటలు, చెడ్డ మాటలు. శాంత వచనములు, సత్యము వచించునవి, ఎదుటివారికి మనోల్లాసము కలిగించునవియు మంచి మాటలు. పరదూషణములును ఒకరికి బాధకలిగించు మాటలు చెడ్డమాటలు. మనము చేయుపనులు రెండువిధములు. మంచిపనులు, చెడ్డపనులు. ఈ మంచి, చెడ్డపనులకు, త్రికరణములు ప్రధానములు. ఒకరికి ఏదైన దానముగా నిచ్చినచో, ముందుగా దానముచేయవలయునని మనస్సున తలచెదము. వాక్కుతో ఆ విషయము బయటపెట్టుదుము. చేతులతో ఆ దానము చేయుదుము. అదే విధముగా చెడ్డపనికికూడా త్రికరణములే ప్రధానములు. మనస్సుతో ఆలోచించునదియు కర్మయే; వాక్కుచేత ఉచ్చరించునదియు కర్మయే. శరీరముతో చేయునదియు కర్మయే. త్రికరణముల సాధనము లేనిదే ఏకర్మయు నెరవేరదు. ఈ త్రికరణములలోకూడ రెండు విధాలవారు ఉన్నారు. త్రికరణశుద్ధి కలవారు, త్రికరణశుద్ధిలేనివారు. ఏదైన ఒక విషయము తలపెట్టినపుడు, మనస్సుచేత ఆవిధముగా తలపెట్టిన దానిని యథాతథముగా నోటితో పలుకుట – నోటితోపలికిన దానిని, యథాతథముగా శరీరముతో చేయుట. ఇదియే త్రికరణశుద్ధి. ఈ విధముగా కర్మ చేయువారు ధన్యాత్ములు. వీరికర్మ పవిత్రమైనది. అందువల్ల వారి ఆత్మకు మేలు చేకూరును. ఇంక రెండవరకమువారు. విషయము ఆలోచించినది ఒకందుకు – బైటపెట్టునది మరొకవిధముగా, చేయునది యింకొకవిధముగ. వీరు త్రికరణశుద్ధి లేనివారు. పాపకర్మ చేయువారు. వీరుచేయుపని అపవిత్రమైనది. వారి ఆత్మకు అశాంతికలుగును. దానినే మంచి కర్మకు పుణ్యము అనియు, చెడ్డకర్మకు పాపము అనియు వ్యవహరింతురు. ఇంకను విస్తరించి చెప్పవలయునన్న — శ్లో॥ పరోపకారః పుణ్యాయ, పాపాయ పరపీడనమ్॥ అనగా ఇతరులకు ఉపకారము జరుగునట్లు మన మేపని చేసినను అది పుణ్యమనియు, ఇతరులకు బాధకలుగుపని ఏమిచేసినను అది పాపమనియు అర్థము. కాబట్టి మనము మనస్సుతో ఏది ఆలోచించినను అది యితరులకు ఉపకరించినచో పుణ్యము. బాధ కలిగించిన పాపము అగును. వాక్కుతో ఏది మాట్లాడినను ఇతరులకు ఉపకరించునది పుణ్యము, బాధ కలిగించునది పాపమగును. శరీరముతో చేసినపని యితరులకు ఉపకరించునెడల పుణ్యము, బాధాకరమైనచో పాపమగును.

కర్మసిద్ధాంతమనగా – మనముచేసిన మంచి, చెడ్డ కర్మల ఫలితము అనుభవించి తీరవలయు ననుట. దీనికి తిరుగులేదు. ఇది భగవంతుని యొక్క శాసనము. ఈ జన్మలోచేసినకర్మకు, ఈ జన్మలోనే ఫలితము అనుభవించవలెనన్న నిర్ణయములేదు. ముందు రాబోవుజన్మలలో, ఏదోఒకజన్మలో, తప్పక అనుభవించియే తీర వలెను. మనముచేసిన ఏ పుణ్యకర్మ, పాప కర్మలయొక్క ఫలితమైనను, ఎప్పటికైనను అనుభవించియే తీరవలెను. ఇది ముమ్మాటికి నిశ్చయము. ఏఏజన్మలో చేసిన కర్మముయొక్క ఫలితము ఏఏజన్మలో అనుభవించవలెనో అది భగవంతునియొక్క నిర్దేశమునుబట్టి యుండును. కర్మచేయుటయే మనవంతుగాని దాని ఫలితము భగవదధీనము. శ్లో॥ త్రిభిర్దినైః, త్రిభిర్పక్షైః త్రిభిర్మాసైః త్రిభిర్వర్షైః। అత్యుత్కటైః, పాపపుణ్యైః, ఇహైవఫలమశ్నుతే॥ ఈ జన్మలో అతి ఘోరపాపముగాని, గొప్ప పుణ్యముగాని చేసినచో, దాని ఫలిత మీ జన్మలోనే మూడు రోజులలోగాని, మూడు పక్షములలోగాని, మూడు నెలలలోగాని— తప్పితే, మూడు సంవత్సరములలోగాని, అనుభవించవలసి యుండును. సామాన్య పుణ్యపాపములయొక్క ఫలితములు ముందుజన్మలలో, భగవదిచ్ఛననుసరించి, అనుభవించవలసి యుండును. మనము పుణ్య కార్యములు చేయబోముకాని, పుణ్యకర్మలు చేసేవారు పొందదగిన, పుణ్యఫలమునకు మాత్రము ఆతురతగా ఎదురుచూచుచుందుము. మనము పాపపుపనిచేయుటకు జంకము, గాని- పాపఫలితము మనమీద పడకుండ, తప్పుకొని పోయిన బాగుండుననుకొందుము. ఇది మానవునియొక్క అల్పస్వభావము. కర్మ అనుభవించక తప్పదు. పుణ్యకార్యములుచేయుటయందు ప్రోత్సాహము కలుగజేయుటకును,— పాప కార్యములుచేయుటయందు భీతికలుగజేయుటకును, భగవంతుడు కర్మసిద్ధాంతమును అంతవిరివిగా అమలులోబెట్టుచున్నాడు. మనలనుబాగు చేయవలెనను దయతోకూడిన తలంపుతో, కర్మ సిద్ధాంతమును అంత అప్రతిహతముగా చేసినాడు. చాకలివాడు, బట్టమురికిపోగొట్టుటకే, బట్టను రాతిపైబెట్టి యుతుకునేగాని, బట్టపై కోపమువల్లకాదు. అదేవిధముగా మనముచేసినపాపకర్మకు భగవంతుడువిధించిన శిక్ష శిక్షకాదు. మన మేలుకొరకే—భగవంతుడు భక్తవత్సలుడు. కరుణామయుడు. మనము ఆతనిని మరచినను, మనలను ఆయన మరువక, అవకాశము ననుసరించి మనకు మేలుచేయుటకు చూచుచుండును. ఈ చావు పుట్టుకలు, ఈ పుణ్యపాపములు, చర్వితచర్వణముగా ఎన్నిజన్మలైనను గొలుసుకట్టుగా జరిగిపోవుచుండవలసినదేనా లేక, విముక్తి యని ఎప్పటికైన నున్నదా అన్నచో—విముక్తి వున్నది. తప్పకుండా విముక్తియున్నది. భగవంతుని ఏ జన్మలో, అపారభక్తితో కొలిచి, సేవచేయుదుమో ఆజన్మలో, మన భక్తిప్రభావముచేత, సంచితమంతయు భస్మీభూతమై, ప్రారబ్ధము గతించినపిమ్మట మోక్షముబడయగలము. ఇందుకు తీక్షణమైన వ్యాకులత ఆవశ్యకము— అద్భుతమైన వ్యాకులత భగవదభిముఖముగనే పరుగెత్తించును. తల్లిని జూచుటకై బిడ్డలకు గలుగునంతటి వ్యాకులతకలుగవలయును. ఇంక కర్మ, పాపము, పుణ్యము, ఎక్కడివి? ఇట్టి వ్యాకులానంతరమే భగవద్దర్శనము. అది కలిగినపిదప ఇక పునర్జన్మలేదు.

# శ్రీ గురు మహిమ

వేదాంత కవిరత్న శ్రీ ఓరుగంటి నారాయణప్ప

దైవవిరచిత మాయామయ ప్రపంచమున నెనుబదినాల్గు లక్షల జీవరాసులలో విజ్ఞానాధిక్యతగల్గుటచే మానవజన్మ శ్రేష్ఠమని తెలియుచున్నది. అట్టి మానవులలో విషయములదారిబోక దేహాదిజగత్తంతయు నశ్వరమని పూర్వపుణ్యవిశేషమున గ్రహించి విజ్ఞానమార్జించి ముక్తిబడయగోరు జిజ్ఞాసు వుత్తముడనియు, అట్టి ముముక్షువును 'భ్రమర కీట న్యాయమున' మానవుని మాధవునిగ జేయు గురుసార్వభౌముడు శ్రేష్ఠతముడనియు తెలియుచున్నది.

శ్లో. గుశబ్దస్త్వంధకారస్యాత్ రుశబ్దస్తన్నిరోధకః।
అంధకారనిరోధస్యా ద్గురురిత్యభిధీయతే॥

అను రీతి గువర్ణమున కంధకారమనియు రువర్ణమునకు అంధకారమునుబాపు ప్రకాశమనియు గురుశబ్దమున కర్థమాచున్నది. అనగా శిష్యుని యంతఃకరణము నావరించియున్న యజ్ఞానాంధకారమును ప్రజ్ఞానజ్యోతిచేబాపి పరబ్రహ్మగా జేయుటవలన గురుమహారాజునకు జ్ఞానప్రదాతయనుట సార్థకమైయున్నది.

మన భరతఖండమున ననాదిగ నార్షేయ పరంపరానుగుణ్యముగ, ముముక్షువులు, విద్యార్థులు, దేశికేంద్రుని, త్రిమూర్తులకును, పరబ్రహ్మమునకును, బోల్చు శ్లోకమును ధ్యానించుట, యాచారమైయున్నది, అదేదన

శ్లో. గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురుదేవో మహేశ్వరః।
గురుసాక్షాత్పరంబ్రహ్మా తస్మై శ్రీగురవేనమః॥

అనగా గురువు బ్రహ్మరూపుడని, విష్ణువనియు, మహేశ్వరుడనియు, పరబ్రహ్మమనియు, అట్టి దేశికునకు నమస్కారమనియు ఈ శ్లోకార్థము విస్పష్టమాచున్నది. ఇందువలన గ్రహింపదగు విషయమేమన, త్రిమూర్తులకుగల సృష్టిస్థితిలయగుణములు. పరబ్రహ్మమునకుగల సచ్చిదానందగుణములు గురునియందెట్లున్నవనుట పరిశోధింపదగిన విషయమైయున్నది.

జీవులు ప్రాపంచిక విషయముల కోరికోరి వాని ననుభవించుచు, పరిభ్రమించుచు, వివిధ కష్టముల నొందుచుందురు. వారి కర్మల ననుసరించి వారివారికి దగిన జన్మల సృష్టించుట చతుర్ముఖబ్రహ్మవిధియైయున్నది. ఆయాజీవుల భోగ్యరాసుల బొందుపరచి పోషించుట విష్ణువు పనిగా నున్నది. కర్మానుభవముకాగానే ఆయా తనువుల శివుడు లయముచేయవలసినదిగా నున్నది. గురునియందు ఈ మూడుపనులు గలవు. దేశికుడొనర్చు సృష్టి స్థితిలయములు సార్థకమైనవి శాశ్వతానందపరతత్త్వమును దర్శింపజేయునవిగా నున్నవి. అదెట్లన:

పూర్వపుణ్యవిశేషమున ప్రపంచము దుఃఖరూపమని దేహము నశ్వరమని, నిత్యశాంతి

నిలయమగా ముక్తిని బొందవలెనని మరణభీతి గలిగి శ్రద్ధాళువై ఫలపుష్పసమితి చేబూని కారణాచార్యుజేరి సాష్టాంగ దండప్రణామము లాచరించిన ముముక్షువు భావము దెలిసికొని 'వత్సా! భయపడకుము నీ వాత్మస్వరూపుడవు, నీకు జననమరణాదులు లేవు. సచ్చిదానంద పరమాత్మయే నీ వను 'తత్త్వమసి' మహావాక్యమును బోధించును. ఇది గురుమహారాజుసృష్టి. ఈ ఉపదేశమువలన జనించిన జ్ఞానము నశించునదికాదు, బ్రహ్మసృష్టి నశించును. అందుచే గురువరుని సృష్టి బ్రహ్మసృష్టికి విలక్షణము.

'తత్త్వమసి' మహావాక్యవివరము: – తత్ = అది, త్వం=నీవు. అసి=అయియున్నావు. అనగా ఆ బ్రహ్మమే నీవు అను అర్థమన్నమాట. తత్-పదమునకు వాచ్యార్థమని లక్ష్యార్థమని త్వం-పదమునకు వాచ్యార్థమని లక్ష్యార్థమని తెలియుచున్నది. అందులో తత్ పదవాచ్యార్థము మాయ మొదలు సకల ప్రపంచము వాచ్యార్థమని. ఇది అనృత జడదుఃఖరూపకమనియు, మాయాధిష్ఠాన చైతన్యము సచ్చిదానంద లక్షణ పరబ్రహ్మమని లక్ష్యార్థము. త్వం-పదమునకు అహంకారము మొదలు దేహాంత్యము వరకు వాచ్యార్థమనియు అనృత జడదుఃఖ రూపమనియు తద్విలక్షణ సచ్చిదానంద ప్రత్యగాత్మయే లక్ష్యార్థమని తెలియుచున్నది. ఈ అహంకార సాక్షియా ప్రత్యగాత్మయే మాయాధిష్ఠాతయగు పరబ్రహ్మమని. అసి-పదము వలన జీవబ్రహ్మైక్యమును బోధించి శిష్యుని సంశయము బాపును అనగా, జహదజహద్ లక్షణచే (విడచి విడువని లక్షణావృత్తిచే) సంశయముబాపును. అనగా మాయాది సర్వ జగత్తు తన్నియంతయగు ఈశ్వరుని, అవిద్యోపాధికుడగు జీవుని అహంకారాది దేహభ్రాంతి యను ఉభయ వాచ్యముల పోదోలి యుభయ లక్ష్యము లొకటేయని ఆ సచ్చిదానంద పరబ్రహ్మమే నీవని సత్యసృష్టి చేయుటవలన చతుర్ముఖ బ్రహ్మకన్న గురుసృష్టి సత్యసృష్టి అధికమైనది. ఇక గురువు విష్ణురూపు డెట్లన్న ఇట్లు బోధించిన బోధ సచ్ఛిష్యునకు స్థిరముగా మది నిలుపుటకై షడ్విధలింగ శ్రవణ యోగమును మరలమరల వినిపించి జ్ఞానపోషణచేయును. ఛాందోగ్యోపనిషత్తునందు చెప్పబడిన 'సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవా ద్వితీయం' అన. సృష్టికి ముందు త్రికాలాబాధ్యమైన సత్పదార్థ ముండెననియు చెప్పు ఉపక్రమలింగ మాదిగ. 'ఏతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం. స ఆత్మ' ఈ దృగ్గోచరమగు నామరూప ప్రపంచమంతయు ఆ యాత్మస్వరూపమే. ఆయాత్మయే సత్యమను ఉపసంహారలింగముతోకూడి అభ్యాసము, అపూర్వము, ఫలము, అర్థవాదము, ఉపపత్తియను షడ్విధలింగములద్వారా, జీవ, జగద్భ్రహ్మల వివరము బోధించి స్థాణుఖనన న్యాయమున తాను బోధించిన తత్త్వమసి వాక్యమునకు బలమొసంగి శిష్యునకు జ్ఞానాభివృద్ధిగలిగించుటవలన విష్ణువుకన్న నధికుడు గురుడనదగును. మఱియు, మాయావిద్యల బోనడచుటవలన శివునికన్న నధికుడు సచ్చిదానంద పరబ్రహ్మమే నీవని దేహాది· జగద్భ్రాంతి శిష్యునకు పోగొట్టుటచే కేవల పరబ్రహ్మ రూపుడే గురుడగుచున్నాడు (త్రిమూర్తులకన్న గురుడు మిన్నయనుటెందులకన వారి సృష్టి జీవులకర్మననుసరించి పరిణామమగుచున్నది. గురుసృష్టియన్నవో సత్యబ్రహ్మప్రతిపాదకము గావున, మిన్నయన్నమాట. గురూపదేశము పునరావృత్తిరహితమోక్షప్రదాయకమని శ్రీ సీతారామాంజనేయ సంవాదమున ద్వితీయా

శ్వాసమున 61-వపద్యమున నీరీతి తెలుపబడినది. అదెదన :

సీ. కలశమేఘములఁద♦ద్గతజలంబులఁ దదీ
య ప్రతిబింబద్వ♦యంబు నొకటిఁ
గడకుఁ ద్రోచిన ఘటా♦కాశ మహాకాశ
ములకు నేకత్వంబు ♦ గలిగినట్లు
వ్యష్టిసమష్టి దే♦హములను ధీమాయ
లను జీవపరమేశు♦లను విచార
దృష్టిచేఁగని నిషే♦ధించినయెడఁ బ్రత్య
గాత్మున కప్పర ♦ మాత్మునకును.

తే. సమరసైక్యంబు ఘటియించు ♦ సత్యమనుచు
నిఖిలవేదాంతశాస్త్రము ♦ ల్నిశ్చయించు
గురువులిట్లుపదేశింపు ♦ దురు బుధులకు
ననఘ యిదియె మదీయ ది♦వ్యాశయంబు.

ఈ విధముగ మాయావిద్య విరచిత దేహజగ ద్భ్రాంతుల నేత్యాత్మిక బోధచే వేరుపరచి ప్రత్యగాత్మాభిన్నపరమాత్మయే నీ వని ఘటాకాశ మహాకాశ దృష్టాంతమున సత్యబ్రహ్మ స్వరూపానుభవము దెల్పుటలో గురుడు పరబ్రహ్మరూపుడనుటలో నతిశయోక్తి లేదుగదా? గాన నిట్టి గురుదేవుని జిజ్ఞాసువు దైవరూపుడని భావించి చతుర్విధ శుశ్రూషలగావించి వారి కృపకు పాత్రుడై బ్రహ్మవిద్యాభ్యాస మొనరించి నిత్యానందపదవి బొందవలెనని భగవదాజ్ఞ.

"తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేనసేవయా
ఉపదేక్ష్యంతితే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః.

గీత అ. ౪, శ్లో. ౩౪.

సీ. గురుపదాంభోజముల్ ♦ గొలువక గల్గునే
ప్రవిమల వైరాగ్య ♦ భాగ్యమహిమ
గురుపాద తీర్థంబు ♦ గ్రోలకకల్గునే
జ్ఞానవిజ్ఞాన యో♦గానుభవము
గురుసుప్రసాదంబుఁ ♦ గొనకున్నఁ గల్గునే
ప్రతిలేని చిత్తోప♦రతి సుఖంబు
గురుతత్త్వమాత్మఁ గ♦న్గొనకున్నఁ గల్గునే
నిరతిశయంబైన ♦ పరమపదము

తే. అట్లుగావున విద్యార్థి ♦ యైన యోగి
వినయ భయభక్తు లెదలోనఁ ♦ బెనఁగొనంగ
నలచతుర్విధ శుశ్రూష ♦ లాచరించి
కొనుము ననిశంబు గురువులఁ ♦ గొలుచు ననఘ.

శ్రీ సీతారామాంజనేయ సంవాదము
తృతీయాశ్వాసము 134 ప॥

# శ్రీ వాసుదేవ మననము

## తృతీయ వర్ణకము

శ్రీ మాచిరాజు శ్రీరామకృష్ణ

(గతసంచిక తరువాయి)

కూటస్థు డనగా.— "బ్రహ్మాదిపిపీలికాంత సర్వప్రాణిబుద్ధి ష్వవిశిష్టత యోపలభ్యమాన స్సర్వప్రాణిబుద్ధి సాక్ష్యధిష్ఠానాత్మా స్తిభాస చేత సకూటస్థః॥" (సర్వసార. ఉ.) బ్రహ్మాదిపిపీలి కాంతమైన యావత్ప్రాణిబుద్ధులయందును అభేదముగ ననుభవింపబడుచు సర్వప్రాణిబుద్ధులకు సాక్షిమాత్రముగ నధిష్ఠానమైయుండి ప్రకాశించుచున్న యా చిదాత్మ - ప్రత్యగాత్మ - యే కూటస్థుడు. "సంధయోఽఖిల వృత్తీనామ భావాశ్చావ భాసితాః। నిర్వికారేణ యేనా సౌ కూటస్థ ఇతిచోచ్యతే॥" (పంచదశి. 8-21) ఒక బుద్ధివృత్తి నశించి మఱియొక బుద్ధివృత్తి పుట్టుచుండగా ఆ రెండువృత్తులయొక్క మధ్య కాలము సంధి యనబడును. అట్టి సంధికాలములును సుషుప్తిమూర్ఛాసమాధ్యవస్థలయందు వృత్తులయొక్క అభావములును అనగా వృత్తులు లేవనియు ఏ నిర్వికారసాక్షి చైతన్యముచేత దోచబడుచున్నవో ఆ యీ సాక్షిచైతన్యమే కూటస్థుడని చెప్పబడును అని శ్రుతిస్మృతి ప్రతిపాదితము. ఈ కూటస్థుడే 'అహం' శబ్ద లక్ష్యార్థము. "అహం" శబ్దమునకు - శరీరము, ఇంద్రియజాతము, ప్రాణవర్గము మనోబుద్ధ్యహంకారచిత్తము మున్నగువాని సముదాయము వాచ్యార్థము. అనగా సకలజనులచేతను సామాన్యముగా భ్రాంతుల యనుభవమునుబట్టి అనాలోచితదృష్టితో చెప్పబడు అర్థము. ఇది యథార్థముకాదు. ఈ శరీరాది సర్వప్రపంచమునకు సాక్షిభూతాంతరాత్మ యగు కూటస్థుడు లక్ష్యార్థము. అనగా సర్వవేదాంత సిద్ధాంతమైన యర్థము. ఇదియే సర్వసారమగు నంశము. కావున "నాహం దేహో నేంద్రియాణ్యాంతరంగం। నాహంకారః ప్రాణవర్గో న బుద్ధిః। దారాపత్య క్షేత్రవిత్తాదిదూరః। సాక్షీ నిత్యః ప్రత్యగాత్మా శివోఽహం॥" (శంకరాచార్యః). శరీరము 'అహం - నేను' కాదు. ఇంద్రియములు నేనుకాదు. మనస్సు నేను కాదు. అహంకారము నేనుకాదు. ప్రాణ వర్గము నేనుకాదు. బుద్ధి నేనుకాదు. దారాపుత్ర ధన క్షేత్రాదులు నేనుకాదు. వీని యన్నిటికంటెను విలక్షణమైన నిత్యమగు సాక్షిరూప ప్రత్యగభిన్న సచ్చిదానంద పరబ్రహ్మమే నేను. "అజడాత్మవదా భ్రాంతియత్సానిధ్యాజ్జడా అపి। దేహేంద్రియ మనఃప్రాణా స్సోహమిత్యవధారయ॥" (అనుభూతిప్రకాశిక 8-10) శరీరేంద్రియ మనఃప్రాణాదులు జడము - అచేతనము - లయ్యును, ఏ చైతన్య సాన్నిధ్యము

వలన చేతనరూపమువలె ప్రకాశించుచు కార్య క్షమములగుచున్నవో 'సోఽహం' = ఆ చైతన్యమే నేను అని నిశ్చయించుకొనుము. "దేహో దేవాలయః ప్రోక్తో జీవోదేవస్సనాతనః । త్యజేదజ్ఞాననిర్మాల్యం సోఽహంభావేనపూజయేత్ ॥" (స్కంద. ఉ. 10) దేహమే దేవాలయమనియు జీవుడే నిత్యమైన దేవుడనియు చెప్పబడినది. కనుక "అభేదదర్శనం జ్ఞానం ధ్యానం నిర్విషయం మనః । స్నానం మనోమలత్యాగః శౌచమింద్రియ నిగ్రహః ॥" (స్కంద. ఉ. 11) ఇంద్రియనిగ్రహ మనెడి శుచిత్వమును పొంది, మనోమల (విషయేచ్ఛ) త్యాగమనెడి స్నానమును జేసి, సర్వవృత్తులను విడిచి స్వాత్మాకారాకారిత వృత్తిమాత్రరూపమైన మనస్సుయొక్క నిర్విషయత్వమనెడి ధ్యానముచేత అభేదదర్శనమనెడి జ్ఞానమును బడసి, ఆ బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానముచేత అజ్ఞానమనెడి నిర్మాల్యమును నిరస్తము - తొలగబడినదిగ - జేసి సోఽహం భావమున స్వస్వరూపాను సంధానము - స్వాత్మనిష్ఠ - ను సంతతము చేయుచుండవలయును. "జ్ఞాత్వాస్వం ప్రత్యగాత్మానం బుద్ధితద్వృత్తిసాక్షిణం। సోఽహమిత్యేవ తద్వృత్త్యా స్వాన్యత్రాత్మమతిం త్యజేత్ ॥" (అధ్యాత్మ. ఉపనిషత్. 2) బుద్ధికిని, బుద్ధివృత్తికిని సాక్షియైన ప్రత్యగాత్మ లక్షణ పరమాత్మను 'సోఽహం'= ఆ పరమాత్మ నేనే' అని స్వాత్మగనే సాక్షాత్తుగ నెఱింగి ప్రత్యగ్బ్రహ్మైకత్వాకారాకారిత వృత్తితో ఆత్మవిలక్షణమైన యఖిలదృశ్యమునందును ఆత్మబుద్ధిని పరిత్యజింపవలయును. "యదాపశ్యః పశ్యతేరుక్మవర్ణం। కర్తారమీశం పురుషం బ్రహ్మయోనిం। తదావిద్వాన్ పుణ్యపాపే విధూయనిరంజనః పరమం సామ్యముపైతి ॥" (ముం. ఉ. 3-1-3) సంతత స్వాత్మానుసంధానపరుడైన బ్రహ్మవిదుడు, రుక్మవర్ణం=స్వయంజ్యోతి స్వభావమును, సర్వజగత్కర్తయు, ఈశం = సర్వభూతాంతర్యామియు, పురుషం=పూర్ణత్వమువలన పురుషశబ్ద వాచ్యుడును, బ్రహ్మయోనిం = అవ్యాకృత బ్రహ్మోపాదానభూతమును అగు సనాతనుడైన వాసుదేవుని స్వాభిన్నముగ నెప్పుడు చూచుచున్నాడో అప్పుడే పుణ్యపాపాదిరూప సమస్త బంధన భూతకర్మములను సమూలముగ నిరసించి, నిరంజనుడై - నిరస్త ప్రకృతిలేపుడగుచు - విగతదుఃఖాత్మక సంసారియగుచు - పరమాత్మ సమత్వమును - బ్రాహ్మీభావమును - పొందుచున్నాడు. ఎట్లనగా "యదానద్యః స్యందమానాస్సముద్రే అస్తంగచ్ఛంతి నామరూపేవిహాయ । తథావిద్వాన్నామరూపాద్విముక్తః పరాత్పరం పురుషముపైతిదివ్యం ॥" (ముం. ఉ. 3-2-8). లోకమునందు నామరూపములు గలిగి ప్రవహించుచున్న గంగా, గోదావరి మొదలగు మహానదులు సముద్రమును పొందినవయి తమతమ నామరూపములను పరిత్యజించి సముద్రముసం దైక్యమును పొంది పృథక్కుగా గనంబడక సముద్రరూపమునే యెటుల పొందుచున్నవో- సముద్రమే యగుచున్నవో — అటులనే స్వాత్మతత్త్వజ్ఞుడును అవిద్యాకృత నామరూపములవలన విముక్తుడై పరాత్పరుడైన చిత్సుఖాత్మక పరమాత్మయందైక్యమును బొంది తత్స్వరూపమే యగుచున్నాడు. "గురుశాస్త్రోక్తమార్గేణ స్వానుభూత్యాచచిద్ఘనే। బ్రహ్మైవాహ మితిజ్ఞాత్వా వీతశోకోభవేన్మునిః ॥" (మహా. ఉ. 4-25) సద్గురూపదిష్ట వేదాంత ప్రతిపాదిత మార్గమునను, స్వానుభూతిచేతను చిద్ఘన పరబ్రహ్మమునందు 'బ్రహ్మైవాహ' మని అపరోక్ష

జ్ఞానమును పొందిన మహాత్ముడు అపగతశోకు డగుచు మునియగును. ఇట్లు "నేతి నేతి" (బృ. ఉ. 2-3-6) 'ఇదికాదు - ఇదికాదు' అనెడి వాక్యముచేత దేహాది పంచకోశముల వలన నుండి పారమార్థిక కూటస్థుని శాఖా చంద్రన్యాయమున, వివేకబుద్ధిచే వేఱుపఱచి ఆ పారమార్థిక కూటస్థుని 'అహం' అని తెలిసి కొనినవాడగుచు, ఆ "అహం బ్రహ్మాస్మి॥" (య. వే.) అనెడి శ్రుతివిచారణముచేతను, శాస్త్రానుగుణమైన యుక్తులచే దృఢనిశ్చయముచేతను స్వాత్మసాక్షాత్కారమును పొందిన బ్రహ్మజ్ఞానియే పరిపూర్ణ బ్రహ్మస్వరూపుడు. "నైనం కృతాకృతే తపతః॥" (బృ. ఉ. 4-4-22) "కృతాకృతే పుణ్యాపాపేన తపతః॥" (బ.అ.9) ఈ బ్రహ్మజ్ఞానిని కృతాకృతములైన పుణ్యపాపములు తపింపజేయజాలవు" అనెడి శ్రుతిసిద్ధాంతముగ నటువంటి బ్రహ్మవిత్తమునే, పుణ్యపాపకర్మము లెవ్వియు పద్మపత్రమును జలమువలె స్పృశింపవని సర్వోపనిషత్తులును ఏకాభిప్రాయముతో ఘోషించుచున్నవి.

# చతుర్థ వర్ణకము

ఇపుడు ఈ జీవునియొక్క దుఃఖమును - జన్మమును - కర్మమును - రాగద్వేషాదులును- అభిమానమును - అవివేకమును - అజ్ఞానమును అను నీ దుఃఖాది సప్తకమునందు పూర్వ పూర్వమును గుఱించి ఉత్తరోత్తరము హేతు వగును. అందు దుఃఖాది చతుష్టయము, చతుర్థ పంచమ వర్ణకములయందు విచారణ చేయ బడును.

శిష్యుడు :— స్వామీ! జీవాత్మయొక్క దుఃఖము స్వాభావికమా? లేక ఆగంతుకమా? అనగా ఏదేని యొక కారణముచేత నాకస్మిక ముగ సంభవించినదా?

గురువు:— వత్సా! జీవాత్మయొక్క దుఃఖము స్వాభావికముకాదు. ఆగంతుకమని తెలియ వలయును.

శి:—స్వామీ! జీవాత్మయొక్క దుఃఖము స్వాభావిక మేల కాగూడదు?

గు:—వత్సా! జీవాత్మయొక్క దుఃఖము స్వాభావికమైన పక్షమున అనేకదోషములు సంభవించును. అదెట్లన - ఈ జీవాత్మయొక్క దుఃఖము స్వాభావికమే యైనయెడల ఆ దుఃఖముయొక్క నివృత్తి ఎన్నటికిని గలుగదు. సుఖమును ఎవ్వనికిని గలుగదు. దుఃఖనివృత్తి కొఱకును సుఖప్రాప్తికొఱకును చేయందగిన కర్మమెద్దియు నెవ్వనికిని నుండదు. సుఖమును పొందించు సాధనములైన సత్కర్మయోగ ధ్యానోపాసనాదులయందు ఎవ్వనికిని ప్రయత్నమే యుండదు. సత్కర్మాది ప్రతిపాదకము లైన వేదశాస్త్ర పురాణములును వ్యర్థము లయ్యెడినని తెలిసికొనుము. ఇది ఆస్తిక సమ్మతముకాదు.

శి:—స్వామీ! జీవాత్మయొక్క దుఃఖము స్వాభావికమగుగాక. ఆ దుఃఖము ప్రయత్న విశేషముచేత నివర్తింపబడదా?

గు:—వత్సా! స్వాభావికము స్వస్వరూప మగుటవలన ఎంత ప్రయత్నముచేసినను స్వాభా విక దుఃఖనివృత్తి యెన్నటికిని సంభవింపదు. స్వభావము నశించిన స్వరూపము నశించును.

స్వస్వరూపనాశముకొఱ కెవ్వ డుద్యోగించును? స్వస్వరూపము నశించిన దగుచుండగా నిక పురుషార్థము ననుభవించువా డెవడు ఉండును?

శి:—స్వామీ! స్వాభావికమే స్వస్వరూపమా?

గు:—వత్సా! బెల్లముయొక్క స్వభావము మధురగుణము. ఆ మధురగుణముయొక్క నాశము కలుగవలసినయెడల బెల్లమునకే నాశము సంభవించును. అటులనే జీవాత్మయొక్క దుఃఖము స్వాభావికమైన పక్షమున ఆ దుఃఖమునకు నాశము కలుగవలసినయెడల ఆత్మస్వరూపనాశమే యగును. ఆత్మకు నాశము లేదు. ఆత్మయవినాశి, నిత్యమునని "అవినాశీ వాఽరేఽయమాత్మాఽనుచ్ఛిత్తిధర్మా॥" (బృ. ఉ. 6-5-14). అబాధిత స్వభావముగల యీ ప్రత్యగభిన్న పరమాత్మ అవినాశి. "ఆకాశవత్సర్వగతశ్చనిత్యం॥" ఆత్మనిత్యము. ఆకాశమువలె సర్వత్ర వ్యాపించియున్నది. "నజాయతే మ్రియతేవా విపశ్చిన్నాయం కుతశ్చిన్నబభూవ కశ్చిత్। అజోనిత్యః శాశ్వతోఽయం పురాణోనహన్యతే హన్యమానే శరీరే॥" (కఠ. ఉ. 1-2-18). ఉత్పత్తిగల వస్తువు అనిత్యము. అది షడ్భావవికార విశిష్టమైయుండును, ఆత్మ అట్టిదికాదు. అయంవిపశ్చిత్ =స్వాభావికముగ సుఖరూప సచ్చిన్మాత్రమైన ఈ యాత్మ, నజాయతే నమ్రియతేవా=పుట్టుటయు లేదు చచ్చుటయు లేదు. కుతశ్చిత్ నబభూవ = మఱియొకనివలన నుండి లేక మఱియొక కారణమువలననుండి కాలేదు. కశ్చిత్ నబభూవ=ఒక్కటియు కాలేదు. అనగా ఈ యాత్మకు కారణభూతమైన వస్త్వంతరము లేదు. కార్యభూతమైన - ఈ యాత్మవలన బుట్టిన - వస్త్వంతరములేదు. అయం= ఈయాత్మ, అజః=జన్మనిమిత్తములేనిది. నిత్యః= నిత్యమైనది. శాశ్వతః=అపక్షయ విరహితమైనది అనగా కృశత్వములేనిది. పురాణః= 'పురా అపి నవ ఏవ పురాణః'=సనాతనమైనను సదా నూతనమైనదే. శరీరేహన్యమానేసతి= శస్త్రాదులచే శరీరము హింసింపబడుచున్నను, అయం ఆత్మానహన్యతే = ఈయాత్మ నశింపబడదు. ఘటము నశింప ఘటాకాశమువలెనే దేహము నశింప ఆత్మ స్వయంస్వరూపముననే ఉండును. "సవా ఏష మహానజ ఆత్మాఽజరోఽమరోఽమృతోఽభయో బ్రహ్మ॥" (బృ. ఉ. 4-4-25). సవై ఏష ఆత్మా=ఆ యీ ఆత్మ, అజః=జన్మవికారశూన్యము. కనుకనే అజరః= జీర్ణింపనిదియు - పరిణమింపనిదియును. కావుననే అమరః = మరణింపనిది. ఏది జన్మించునో మఱియు పరిణమించునో మఱియు జీర్ణించునో అది మరణించును. ఆత్మ జన్మించనిది, పరిణమించనిది, జీర్ణించనిదియు నగుట మరణించనిది యని అర్థము. జన్మజరామరణరాహిత్య హేతువు చేతనే అమృతః=వికారశూన్యముగ నిత్యము. మహాన్ బ్రహ్మ=పరబ్రహ్మతత్త్వము, అభయః= అద్వైతత్త్వముచే అభయరూపము. "జీవాపేతం వావకి వేదంమ్రియతే। నజీవోమ్రియత। స ఏషో అణిమా॥" (ఛాం. ఉ. 6-11-3). ఇదం=ఈ శరీరము, జీవాపేతంవా=జీవునిచేత పరిత్యజింపబడియే, మ్రియతే = మరణించుచున్నది. జీవః నమ్రియత=జీవుడు మరణించుట లేదు. స ఏషో అణిమా=ఈ విషయము కడు సూక్ష్మము. జీవవియుక్తమైన శరీరమునకు మాత్రమే నాశము సంభవించుచున్నది కాని జీవాత్మకుమాత్రము నాశమెన్నడును సంభవింపదు. "అవినాశితు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్। వినాశమవ్యయస్యాస్య నకశ్చిత్కర్తుమర్హతి॥" (గీ. 2-17). అవిద్యాకార్యమైనది-

పరిణామమైనది-, ఆత్మవివర్తమైనది యగు నీ జగత్తంతయు బాహ్యాభ్యంతరములయందంత టను పరిపూర్ణముగనే సదాత్మక పరబ్రహ్మ ముచే సంతతము సంవ్యాప్తమైయున్నదో అట్టి సద్రూపాత్మ సత్స్వభావముచేత అవినాశి, అస ద్వస్తువవలె నశించుట యనెడి వికారమునకు విషయముకాని స్వభావము సత్త, దేనికిగలదో అది అవినాశి. అతి సూక్ష్మత్వమువలనను అతి మహత్త్వమువలనను స్వయంవినాశన క్రియాతిగ మగుచు అనగా స్వయముగనే వినాశమొందుట యనెడి వికారమును అతిక్రమించినదగుచు నిత్యమే యగుచున్నదని యర్థము. ఏ ప్రకా రముననను నశింపనిదగుటచే అవ్యయమును నిత్య సిద్ధమైన సత్త్వమునగు ఈ యాత్మకు వినాశ భావమును కలుగజేయుటకుగాని చెప్పుటకుగాని ఎట్టివారికిని శక్యముగాదు'' అను నిత్యాది శ్రుతులు ప్రమాణము.

శి:—స్వామీ! అట్లయిన ఆత్మయొక్క అవి నాశిత్వము సిద్ధాంతమైన పక్షమున మరణ మననేమి ?

గు:—వత్సా ! వినుము. ''ప్రమాదో బ్రహ్మనిష్ఠాయాం నకర్తవ్యః కదాచన। ప్రమా దోమృత్యురిత్యాహుః విద్యాయాం బ్రహ్మ వేదినః॥'' (అధ్యాత్మ. ఉ. 14) బ్రహ్మనిష్ఠా విషయమున ప్రమాదము - ఏమఱుపాటు - ను ఎన్నడును పొందదగదు. బ్రహ్మవిజ్ఞానులయొక్క స్వరూపభూతమైన బ్రహ్మవిద్యావిషయమున ప్రమాదమును పొందుటయే మృత్యువని తత్త్వ వేత్తలు చెప్పుదురని శ్రుతివచనము. ''ప్రమా దంవై బ్రహ్మవిద్యాయాం మృత్యుమహం బ్రవీమి॥ ఇతిసనత్సుజాతః॥'' స్వాత్మాజ్ఞానరూప మైన ప్రమాదమే మృత్యువని నేను చెప్పు చున్నాను - అని సనత్సుజాత వచనము.

అందువలన పరమచిదానందరూపాత్మకు దుఃఖము స్వాభావికముకాదు. మఱేమన ఆగం తుకమే యని తెలిసికొనుము.

శి:—స్వామీ! స్వాభావికము నశించినను స్వరూపము నశింపక యవశేషించి యుండ గూడదా ?

గు:—వత్సా! అది యెన్నడును సంభ వింపదు.

శి:—స్వామీ! ఇటు వినుడు. అగ్నికి స్వాభావికమైన ఉష్ణత్వము మణిమంత్రౌషధ ములచేత దొలగవచ్చును. స్వరూపముకూడ నశించుటలేదు. అన్యమైన శైత్యముకూడ కలుగుచున్నది. అటులనే ఆత్మకు దుఃఖము స్వాభావికము కావచ్చును. అయినను ఆ దుఃఖము ఉత్కృష్ట కర్మోపాసనా యోగబలము చేత దొలగవచ్చును. సుఖమును కలుగవచ్చును గదా ?

గు:—వత్సా! ఆ నివృత్తి తాత్కాలిక నివృత్తియే కాని నిత్యమైన నివృత్తికాదు. అదెట్లన - కర్మజన్యమైనదంతయుగూడ కర్మ క్షయమునందు నశించుచున్నది. నీవు చెప్పిన దృష్టాంతమునందు అగ్నియొక్క ఉష్ణత్వము మణిమంత్రౌషధములచేత తాత్కాలికముగ దొలగినను ఆ మణిమంత్రౌషధముల అపనయ మున అగ్నికి స్వాభావికమైన ఉష్ణత్వము మఱల వచ్చును. ఆగంతుకమైన శైత్యము పోవును. అట్లే దార్ష్టాంతికమునందు ఉత్కృష్ట కర్మో పాసనా యోగబలముచేత ఆత్మయొక్క దుఃఖము తాత్కాలికముగ దొలగినను ఆ యుత్కృష్ట కర్మోపాసనా యోగబలక్షయమున ఆత్మకు స్వాభావికమైన దుఃఖత్వము మఱల వచ్చును. ఆగంతుకమైన సుఖము పోవును.

ఇట్లే యగునెడల సర్వజీవులకు తాత్కాలిక ముక్తియే కలుగును కాని పునర్జన్మరహితమైన ముక్తి సిద్ధింపదు. మఱియు కర్మాదులచేత మోక్షమునకు జన్యత్వము కలిగినయెడల "జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ॥" (గీ. 2.27.) పుట్టినదానికి మరణము నిశ్చయము. చచ్చినదానికి జననము నిశ్చయము" అనెడి న్యాయమున మోక్షమునకు అనిత్యత్వము సంభవించును. "న చ పునరావర్తతే॥" (ఛాం.ఉ. 8-15-1) జీవన్ముక్తుడైన బ్రహ్మవిదుడు పునర్భవము పొందడు." అనెడి ముక్తియొక్క నిత్యత్వ ప్రతిపాదక శ్రుతికిని; "అఖండమానందమరూప మద్భుతమ్॥" (కై. ఉ. 7.) అనెడి ఆత్మయొక్క అఖండానందత్వ ప్రతిపాదక శ్రుతికిని విరోధము కలుగును. ఆత్మ యొక్క దుఃఖస్వాభావత్వమునందు, సుషుప్త్యవస్థయందును తూష్ణీంభావము అనగా జాగ్రదవస్థయందు సంకల్పరహితమైన సమయము నందును యోగులయొక్క సమాధ్యవస్థయందును దుఃఖమే అనుభవింపబడవలసియుండును. అట్లగుపడుచుండుటలేదు. మఱేమన ఆమూడవస్థలలోనుకూడ వ్యుత్థానానంతరము 'ఏతావత్పర్యంతం సుఖమేవాహమాసం॥' ఇంత పర్యంతము నేను సుఖముగనే యున్నాను.' అని సుఖానుభూతియే స్మరింపబడుచున్నది. అందువలన ఆత్మకు సుఖమే స్వాభావికము. దుఃఖ మాగంతుకమునని తెలిసికొనుము.

(సశేషము)

---

# ప్రశ్నోత్తరములు

[పాఠకలోకము నానాడు తమ సందేహనివృత్తికొఱకు మాకు బంపుచున్న ఆధ్యాత్మికప్రశ్నల కీ 'ప్రశ్నోత్తరము' లను శీర్షికయందు ఉత్తరములు ప్రచురింప నుద్యమించితిమని తెలుపుటకు సంతసించుచున్నాము.—సంపాదకులు]

ప్రశ్న : ప్రశాంతి, ధైర్యము, ఏకాగ్రత, ఉత్సాహము—వీనిని బడయుటకును, వానిని పొందిన పిమ్మట శాశ్వతముగ నిలుపుకొనుట కును గల యుపాయమేది ?

ఈ విశ్వమునందు మనలను వివిధ విషయ లంపటుల గావించి, మన మనస్సును కలంకిత మొనర్చునది ఆయా విషయములందలి ఆకర్షణ. ఈ ఆకర్షణ వారివారి చిత్తవృత్తిని, చిత్త స్థైర్యమును ననుసరించి కొందరియందు స్వల్పముగను మఱికొందఱియం దెక్కుడుగను గనిపించును. మఱియు ఆయాకర్షణము ఆయా ఇంద్రియముల బలముననుసరించి ఆయా విషయములందు ప్రసరించుచుండును. ప్రపంచము నందలి ప్రజలెల్లరును ఒకేచిత్తవృత్తితోడను ఒకేవిధమగు చిత్తస్థైర్యముతోడను జన్మింపక పోవుటవలన వారివారి చిత్తవృత్తి ననుసరించి ఒక్కొక్కరికి ఒక్కొక్క విషయమున ఈ ఆకర్షణము కొద్ది గొప్పలుగా కలుగుచుండును. అది వారివారి మానసికశక్తిని ఇంద్రియబలమును అనుసరించుచుండును. కావుననే ఒక్కొక్కరికి

ఒక్కొక్క విషయమునందు ఈ ఆకర్షణ యెక్కువగను ఒక్కొక్కరికి తక్కువగను కలుగుచుండును. ఉదాహరణమునకు ఒక్కొక్కరికి సంగీతమన్న విసుగు విరామములేక వినవలయుననిపించును. ఇది శ్రోత్రేంద్రియాకర్షణము. కొందరకు మృష్టాన్నభోజనమన్న వెగటులేక భుజింపవలయుననిపించును. ఇది జిహ్వేంద్రియాకర్షణము. ఇట్లే ప్రతి ఇంద్రియ ఆకర్షణమును మానవుని తనవైపునకు లాగుచుండును. ఇట్లు ప్రపంచమునందలి ప్రతి మానవునకును ఒక్కొక్క విషయమున అభిలాష మెండుగను ఒక్కొక్క విషయమున తక్కువగను నుండును. అందరకును ఒకేవిధమయిన విషయమున నభిలాష యుండదు. ఉన్నను అందరకును ఒకే పరిమాణములో నుండదు. ఇట్లే ఇంద్రియాతీతమగు విషయాకర్షణము—అతీంద్రియ విషయాకర్షణము—అగు పరతత్త్వాన్వేషణమున కొందరకు కొద్దిగను కొందరకు గొప్పగను అభిలాష కలుగుచుండును. కాని ఈ అతీంద్రియ విషయమునందు ఎవరో పూర్వసంస్కారపూరితులగు వారికే అభిలాష పొడమును. అదియును ఎంతో అరుదు. అసలు పరతత్త్వాన్వేషణము రుచించుటయే అరుదన్నచో దానియందు కుతూహలము కలుగుట సులభమా?

సాధారణ మానవుని మనస్సు ఇంద్రియాధీనమగుచుండును. కావున ఆ యింద్రియములే అతని మనస్సును వశీభూతము కావించుకొని యటు నిటు ద్రిప్పుచుండును. కావున సాధారణ మానవునకు—అనగా సాధనసంపత్తి లేని వానికి—పూర్వపుణ్యావశమున పరతత్త్వాన్వేషణమున నభిరుచి కలిగినను ఇంద్రియములీ మనస్సును మాటిమాటికి అధమస్థాయికి లాగుచునేయుండును. కావున అది పరతత్త్వమునందు స్థైర్యమును పొందదు.

ఈ పరతత్త్వాన్వేషణము ప్రాపంచిక విషయానందమును మించిన యానందమును కలిగింపగలదన్న విశ్వాసము కలుగవలయును. ఆ నమ్మకము కుదిరి కుదుటబడినపిమ్మట భగవత్సాక్షాత్కారభాగ్యమును బడసిన మహనీయుల చరిత్రముల జదివి తమ నమ్మకమును సాధకులు బలపఱచుకొనవలయును. ఈ అన్వేషణమునందు ఉత్సాహము మందగించినప్పుడెల్ల భక్తుల జీవితచరిత్రలు వారి సదుపదేశములు చదివినచో మరల ఆ విశ్వాసము కుదుటబడగలదు. సాధనమార్గమునందిదియే మొట్టమొదటి మెట్టు. ఆదినుండియు ప్రతివారికిని విశ్వాసము కుదురదు. అయినను పరతత్త్వాన్వేషణమే నాకు ఆనందమును శ్రేయస్సును ప్రసాదించునన్న నమ్మకముమాత్రమున్నచో మన మా ఉత్సాహమును బలపఱచుకొనవచ్చును; పెంపొందించుకొనవచ్చును. శ్రీరామకృష్ణ గురుదేవుడు విశ్వాసముయొక్క ఆవశ్యకతను నొక్కివక్కాణించెడివారు. ఏలయన విశ్వాసమువినా ఏమియు జరుగదు. అది యున్నచో ధైర్యము, ఏకాగ్రత, ఉత్సాహము—వీనినన్నింటిని సంపాదించుకొనవచ్చును.

“భగవానుడొక్కడే సద్వస్తువు. వాని దర్శనభాగ్యమువలన నా సందేహములు, కష్టములు—అన్నియు నివర్తియై అపరిమితానంత శుభమును చేకూర్చుకొనగలను. ఎందఱో మహాపురుషులనుభవించిన ఆనందలాభమే నా లక్ష్యము” అన్న పట్టుదల కలిగినచో మనము ప్రతినిమిషమును దీనిని బడయుటకై ప్రయత్నింతుము.

మన ఇంద్రియములే మన లక్ష్యమున కాటంకముల గలిగించుటవలన మన మా యింద్రియసందోహమును వశీభూతముగావించు కొనవలయును. ఉపనిషత్కర్తలు వానిని అశ్వ ములతోఁ బోల్చి, వానిని లొంగదీసినవాఁడే ఆత్మ సాక్షాత్కారము పొందగలడని వచించి యున్నారు. ఇంద్రియముల నాకర్షించు విష యములనుండి ఎంతదూరులమగుదుమో భగ వంతుని వైపునకు అంతదగ్గరగా నుండగలము. ఇంద్రియములను ప్రప్రథమమున వశీభూత మొనర్చుకొన్నచో నిక నవి మనల ప్రాణ బంధువులవలె భగవత్సాక్షాత్కారోన్ముఖుల గావించును. అపుడు మనకు ధైర్యము కలు గును. మన ప్రయత్నములన్నియు కొనసాగక పోవచ్చును. ఎంతయో వైరాగ్యము నవలం బించినను ఒక్కొక్కపరి విషయాసక్తి మనలను మన లక్ష్యమునుండి వేఱుపఱచుచుండును. అయినను మన సాధనయందలి లోపమును మనము గ్రహించినంతనే యింకను జాగరూక తతోఁ మెలగ ప్రయత్నింపవలయునే కాని మన లక్ష్యదృష్టిని విడువరాదు. శ్రద్ధతోఁడను పట్టు దలతోఁడను మన లక్ష్యమువైపునకు నడువవల యును. ఎందరో ఋషులు, ఎన్నియోసార్లు తమదారి తప్పినప్పటికిని పట్టునదలక తప మొనర్చి ఉన్నతస్థితినందినట్లు విశ్వామిత్రుని వంటివారి జీవితపఠనమువలన దెలియవచ్చు చున్నది. కావున ప్రమాదము తటస్థించినంత మాత్రమున లక్ష్యమునుమాత్రము విడువ రాదు.

మనస్సును నితరవిషయముల బ్రసరింప నీయక ఒకేవిషయమునందు ఎంతోకాలము లగ్నముగావించుట యేకాగ్రత యనబడును. అట్టిసమయమున మన చింతాప్రవాహ మవిచ్ఛి న్నమై తైలధారవలె నుండును. ఇట్టి స్థితి సహజముగా నప్పుడప్పుడు నొక్కొక్కరికి కలుగుచుండును. మనకిష్టమగు కార్యము లాచరించుటయో, ప్రియవస్తువుల నిరీక్షించు టయో, ప్రియవచన శ్రవణముగావించుటయో సంభవించిన సమయమున మనసు బాహ్యప్రపం చమునువీడి ఆంతరికమై ప్రసరించుచుండును. ఇది ఎల్లరకును అనుభవైకవేద్యము. కావున ఏకాగ్రతాసాధనకు విషయమును మనము ప్రియతమము గావించుకొనవలయును. అట్లు విషయమును ప్రియతమముగావించుకొని దాని యందు మనస్సును లగ్నముగావింపగలిగినంత కాలము లగ్నముచేసి—అభ్యాసము కొలది సాధన గావించినయెడల ఈ యేకాగ్రతాశక్తి అభివృద్ధి చెందును. పరతత్త్వాన్వేషణమున బాహ్యవిషయముల సహాయమువలననే ఈ శక్తిని పెంచుకొనవచ్చును.

అందరును ఈ ఏకాగ్రతను సమానముగా పొందజాలరు. వారి పూర్వసంస్కారములు, వారి ఆరోగ్యము, మనోధైర్యము మున్నగు వానియందే వారి యేకాగ్రత ఆధారపడి యుండును. కొందఱు జంతువులవలె ఏ విషయ మునను ఇదమిత్థముగా తమ మనస్సును క్షణ కాలమయినను నిలుపజాలరు. ఆరోగ్యము చెడినను ఇట్లు జరుగుచుండును. ఈ ఏకాగ్రతా శక్తిని కొద్దికొద్దిగా అభివృద్ధిగావించుకొన్నచో ఎన్నియో మహత్కార్యముల చేయగలుగు దుము. ఆధ్యాత్మికజీవితమున ఏకాగ్రతయే అత్యంతావశ్యకము. దానిమూలముననే ధ్యాన ధారణ సమాధులు లభించును. సుస్థిరాభ్యాసమే యేతల్లాభమునకు హేతుభూతము.



# సంఘవార్తలు

పాట్నా ఆశ్రమమునందు శ్రీరామకృష్ణ పరమహంస 118–వ జన్మదినమహోత్సవ సందర్భమున, శ్రీరామకృష్ణమఠ సేవాసంఘముల సర్వాధ్యక్షులు శ్రీ శ్రీ శంకరానందస్వాములవారు శ్రీ రామకృష్ణగురుదేవుని విగ్రహమును 16–3–53 న ప్రతిష్ఠాపనము చేసిరి. ఈయుత్సవ కాలమున ప్రత్యేకయజ్ఞములు, పూజలు, భజనలు, బహిరంగసభలు, దరిద్రనారాయణసేవ జరుపబడినవి. అసంఖ్యాకులగు సోదరసన్న్యాసులీ కార్యక్రమములందు పాల్గొని ఉత్సవమును జయప్రదముగావించిరి.

గౌరవనీయులు పశ్చిమ బంగాళము గవర్నరుగారు మార్చి 24 న కంకైనందలి శ్రీరామకృష్ణ సేవాసంఘ సేవాశ్రమమునకు జెంది, నూతనముగ నిర్మింపబడిన విద్యార్థినిలయమునకు ప్రారంభోత్సవము జేసిరి.

శ్రీ రామకృష్ణమఠ సేవాసంఘ సర్వాధ్యక్షులు మార్చి 25 న షిల్లాంగు ఆశ్రమమున శ్రీ రామకృష్ణ గురుదేవుని పాలరాతి విగ్రహమును ప్రతిష్ఠించిరి. ఈ సమయముననే శ్రీగురుదేవుని జన్మదినోత్సవము జరుపబడినది. అస్సామునందలి వివిధభాగములనుండి వేలకొలది భక్తులును సన్న్యాసులును బ్రహ్మచారులును వచ్చి అచ్చటి స్థానిక ప్రజానీకముతో కలిసి ప్రత్యేక పూజలయందును భజనలయందును, బహిరంగ సభలయందును దరిద్రనారాయణసేవయందును పాల్గొని కార్యక్రమమును జయప్రదము గావించిరి.

---

చెన్నపురి శ్రీ రామకృష్ణమఠమున

## శ్రీ రామకృష్ణపరమహంసదేవుని

నూట పదునెనిమిదవ జన్మదిన మహోత్సవము

[గతసంచికయందు స్థలాభావమునజేసి ప్రకటింపజాలకపోయిన బహిరంగోపన్యాసములందు శ్రీ యస్. వేంకటభుజంగరాయశర్మగారి ఆంధ్రోపన్యాసమును మాత్రము వీలునుబట్టి సంగ్రహరూపమున ప్రచురించుచున్నాము.–సంపాదకులు.]

'శ్రీ రామకృష్ణపరమహంసనుగూర్చి నేను సంపూర్ణముగా తెలిసికొనజాలక పోయితి'నని శ్రీవివేకానందస్వామియే వచించియున్నాడు. కాబట్టి ఆ మహాత్మునిగూర్చి నేను వివరింప బూనుకొనుటలేదు. ఆయన అవతారమునకు హేతుభూతమయిన ఆవశ్యకతను తన కార్యాచరణమున ఆ మహాత్ముడనుసరించిన స్థూలమార్గములను మాత్రము కొంతవఱకు చర్చింప ప్రయత్నించుచున్నాను.

ఆయన అవతారమునకు గలిగిన ఆవశ్యకతను గుర్తింపవలయునన్న నాటి సాంఘిక పరిస్థితిని చరిత్రాంశమును చక్కగ అవగాహనము చేసికొనవలయును. ఎనిమిది శతాబ్దముల నుండియు పాతుకొనిపోయిన మహమ్మదీయపాలనము మన పుణ్యక్షేత్రములన్నింటిని నాశనము చేయుటయందేమి, అసంఖ్యాకులగు భారతీయుల, ముఖ్యముగా హింసాత్మకచర్యలవలన, తమమతమునందు కలుపుకొనుటయందేమి, వారి స్త్రీజనాంగమును బలాత్కరించి తమ 'జనానా'లకు జేర్చుకొనుటయందేమి తన సామర్థ్యము ప్రకటించి మించినది. ఇట్టి భీషణ కృత్యములొనర్చియు వారు మన దేశీయుల

మతాసక్తిని మతధర్మమును చలింపజేయజాలరైరి. కాని పాశ్చాత్యులు తమవైజ్ఞానిక ప్రాబల్యమువలన కొలది శతాబ్దములలోననే మన దేశీయుల మనోపద్మములందు మన మతమును సంస్కృతినిగూర్చి హైన్యతను సృష్టింపగలిగిరి. వారు తమతార్కిక జ్ఞానమువలననేమి భౌతికవిజ్ఞానమువలననేమి మన దేశీయుల మతాసక్తి నిర్హేతుకమని ప్రమాణీకరింపగలిగిరి. భగవత్సాక్షాత్కారము తార్కిక జ్ఞానమునకవ్వలిమెట్టని గుర్తింపని నాటి మిడిమిడిజ్ఞానముగల సంఘము వారి వలలోబడిపోయెను. ఈ అవినీతియు నాస్తికత్వమును మిక్కిలిగా ప్రబలిపోయినవి. అవతారమే కాని హిందూమతమునకు ప్రాణభిక్షపెట్టలేని పరిస్థితి సంభవించినది. ధర్మసంస్థాపనార్థము భగవాను డప్పుడప్పు డవతరించునట్లు నాటి సాంఘికదుఃస్థితిని చక్కబెట్టుటకే శ్రీ రామకృష్ణ గురుదేవు డిహమునకు రావలసివచ్చెను.

భగవత్సాక్షాత్కారమునందు, భగవత్ప్రాప్తియందు, శ్రీరామకృష్ణుడు సంపూర్ణముగా ఉన్నతస్థితిని, పరాకాష్ఠను, ప్రాపించెను. ఆయన యొక దేవ్యారాధనమార్గమున స్వస్వరూపమును గాంచెను. ప్రప్రథమమున ఆయన దేవీసాక్షాత్కారార్థము సామాన్యమానవుని వలె ఏడ్చుచు, నా సర్వస్వము నీవే యనియు, నిన్నువినా నా కన్యమనవసరమనియు దుఃఖించుచు, చివరకు దేవీసాక్షాత్కారరహితమగు జీవనము వ్యర్థమని తలచి ఆమె సమక్షమున తన శిరోవధమునకుగూడ బూనుకొనెను. ఇదంతయుజేసి సాక్షాత్కారభాగ్యము నందిన పిమ్మట ఆయన దైవాన్వేషణమున ప్రతిమతమునుబోధించు సాధననవలంబించియు హిందూమతమునందలి వివిధశాఖా శాస్త్రధర్మముల నవలంబించియు అన్నింటిమూలమునను నొకే గమ్యమును బ్రాపించెను. అట్లు వివిధమత సాధనల నవలంబించి యొకేపరతత్త్వమును—గమ్యమును—ప్రాపించిన మహనీయు డాయన ఒక్కడే. ఇదియునుఅనవసరముకాకపోయినది. మతవిజ్ఞానము క్షీణించి పాశ్చాత్యుల ఆమోదమునకు ఎదురుచూచుచున్న నాటి సాంఘిక దుఃస్థితి నిర్మూలనమున కిది యెంతయో ఆవశ్యకమయ్యెను. ఇట్టి సాధన నవలంబించి గమ్యమును బ్రాపించిన ఆ మహాత్ముడు తన తపఃఫలమును పాశ్చాత్యలోకమును హైందవ సిద్ధాంత క్రోడీకరణమునను హేతువాద నిరూపణమునను విముగ్ధమొనర్ప సమర్థుడగు శ్రీ వివేకానందస్వామికి పరివర్తింపజేసెను. అప్పుడు శ్రీ వివేకానందస్వామి అద్వైత ధ్వజస్థాపనము గావించి సనాతనమతధర్మప్రచారమున పాశ్చాత్యలోకవిజయము నందేమి, హిందూదేశమున ఏతన్మత సుస్థిరస్థాపనముననేమి లక్ష్యసిద్ధిని గాంచెను. శ్రీ రామకృష్ణ గురుదేవుడు భక్తుడు, జ్ఞాని మరియు విజ్ఞానియు వీనియన్నింటి సమిష్టిస్వరూపుడును గావుటవలన ప్రతి మానవుడును తన తన అభిమతానుసారిణి ఆయనను గురువుగా నంగీకరింపవలసివచ్చెను. సర్వసామాన్యమైన నాటి క్రైస్తవ నిరీక్షణము కూడ హైందవమత ప్రతిపత్తుగా పునః పరివర్తింపబడెను. అందుమూలమున హిందూమతము తన మాతృదేశమున మరల చిగిరింపదొడగి, ప్రపంచమునందలి వివిధప్రాంతముల కెగబ్రాకజొచ్చెను.

సంపాదకులు : శ్రీ ఋతజానందస్వామి

శ్రీ కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటరు ప్రెస్స్ లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి, శ్రీ శుద్ధసత్త్వానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 17-4-53.